# బ్రహ్మదత్త శాస్త్రి మోక్షప్రాప్తి
# బడుగువర్గాల విద్యావ్యాప్తి

'న' కార నవ్య సాహిత్యాన్ని
తృతీయ ముద్రణము ఇందులో
పొందుపరచియున్నాము

ప్రజాకవి :
పచ్చారి వెంకటేశ్వర్లు

ఆనంద పబ్లికేషన్స్, చావుదల (P. O.)
(వయా) బిట్రగుంట



ఏడుకొండల పయిచేరి
ప్రజలను ఏలుచున్న
దివ్యమంగళ శ్యామల రూప
రత్నమయ చారు కిరీట శిరో విభాగ
నా చిన్నారి కైత కన్నియను
భవత్పద పద్మములకు సమర్పిస్తున్నాను
నీ కృపా ముద్రితమైన అభయముద్రను
చూపి, ఏలుకొనవయ్యా!...
శ్రీవేంకటేశ్వరా!
మీకు అంకితముగా వెలువరింప గలిగితిని.

తృప్తోఽస్మి

రచయిత్రి

# అమెరికాలోని మన మేధావులకు మనవి !

ఆర్యా !

మనదేశములో అనాథలుగా యున్నవారు అనేకులు వున్నారు. వృద్ధులకు బిడ్డలు వుండి, అన్నము పెట్టువారులేక, ఆత్మహత్యలు చేసుకున్నవారు వున్నారు. అట్టివారికి 'వృద్ధాశ్రమముగా' ఏర్పాటు చేయ నిశ్చయించి, నా పేర వున్న ఒకటిన్నర ఎకరము మాగాణి భూమి దానముగా యిచ్చుటకు నిర్ణయించుకున్నాను. కావలి, ముసునూరు మధ్య గవర్నమెంటు భూమి అయిదు ఎకరములు యిచ్చుటకు నిర్ణయించి యున్నారు. తమరు పంపు భూరి విరాళములను బ్యాంకులో వుంచి, అందు వచ్చు వడ్డీతో శాశ్వతముగా జరుపుటకు ఏర్పాట్లు చేయుచున్నాము. మాకు పంపవలసిన అడ్రసు :

ప్రజాకవి – పచ్చారి వెంకటేశ్వర్లు
చామదల పోస్టు
వయా ఎర్రగుంట,
నెల్లూరు జిల్లా. (ఎ. పి.)

---

# మానవ సేవే - మాధవ సేవ

శ్లో॥ నత్వహం కామయే రాజ్యం
న స్వర్గం నా౽పునర్భవం
కామ దుఃఖాభితప్తానాం
ప్రాణినాం ఆర్తి నాశనమ్॥
నేను రాజ్యమును కోరను
స్వర్గమును కోరను
పునర్జన్మ లేకుండుటను (మోక్షమును) కోరను-
దుఃఖ తప్తులైన ప్రాణుల ఆర్తి నశింప
వలెనని కోరుచున్నాను.

**మహాత్మాగాంధీ నిత్యప్రార్థన**

24-8-93

## కె. ఎస్. రామానుజాచార్యులు

ఎం.ఎ., భాషాప్రవీణ, విద్యాప్రవీణ, రిటైర్డ్ ప్రిన్సిపాల్,
మూలపేట, నెల్లూరు-3.

శ్రీయుతులు ప్రజాకవి, పచ్చారి వెంకటేశ్వర్లు కవిగారికి,
నమస్కారములు—

ఉభయకుశలోపరి - ఆర్యా - తమరు దయతో ఒసంగిన "బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి, బడుగువర్గాల విద్యావ్యాప్తి" అను తమ అమూల్య రచనను, ఈరోజు చూచి ఆనందించినాను. లోపలి విషయమేగాక, అరుదైన ముఖపత్రము, అందమైనముద్రణ పాఠకులను ప్రోత్సహించుచున్నది.

ఇన్నాళ్ళకు తమరి శ్రమ ఫలించినందులకు, మీతోపాటు మాకును పరమానందముగ యున్నది. ఆంధ్రపాఠకలోకము ఆదరించగలరని ఆశిస్తున్నాను. గ్రంథావిష్కరణ త్వరలో జరుపగలరని తలంతును. నా మీదగల ఆదరాభిమానములకు కృతజ్ఞుడను. ఇట్లు,

కె. ఎస్. రామానుజాచార్యులు, ఎం.ఎ.

వారి నమస్కారములు తీసుకొనగలిగిన అదృష్టం నాకులేదు.

వారికి శతసహస్ర అభినందనలు తెలుపుతున్నాను.

క్యాంపు : విజయవాడ,
ఆఫ్కో గెస్టుహౌస్,

రచయిత :
పచ్చారి వెంకటేశ్వర్లు.

27-5-94

## డా. జి. సమరం

యం.బి.బి.యస్. ఫోన్ హాస్పి : 472370
వాసవ్య నర్సింగ్‌హోమ్, విజయవాడ-6. రెసి : 472330

ప్రజాకవి పచ్చారి వెంకటేశ్వర్లుగారు రచించిన "బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి, బడుగువర్గాల విద్యావ్యాప్తి" న కారం నవ్యసాహిత్య, చిత్రకవిత, అక్షరవిన్యాసం గ్రంథాలను చదివాను. వారికృషి ఎంతో ప్రశంసనీయం. చదువు బ్రతుకుకి అర్థం చెప్తుంది. బంగారు బాటవేస్తుంది చదువు విలువని అన్ని వర్గాలవారికి అర్థమయ్యేరీతిలో చెప్పిన శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లుగారు అభినందనీయులు. — సమరం

ఆంధ్ర ముఖ్యమంత్రిగాను,

ఉత్తరప్రదేశ్ గవర్నరు గాను వెలుగొందిన

## బెజవాడ గోపాలరెడ్డిగారు

ప్రజాకవి :- పచ్చార్రి వెంకటేశ్వర్లుగారు తమ "బ్రహ్మ దత్తశాస్త్రి మోక్షప్రాప్తి" అను గ్రంథములో ముఖ్యమైన ఘట్టములు కొన్ని చదివి వినిపించినారు. వారి సాహిత్య చర్చ అమోఘముగా యున్నది. ప్రాసానుప్రాసలు అంత్య ప్రాసలతో గ్రంథమంతా నింపుకున్నది. పేజీ నింపి మరు పేజీలో చొచ్చుకున్నవి అంత్యప్రాసలు, అత్యద్భుతంగా ఆశ్చర్య కరంగా యున్నది వీరి రచన.

వారు ఏ విషయము చర్చించినా ప్రజలకు అర్థమయ్యే భాషలో రమ్యముగా చెప్పగలరు. వారి సాహిత్య ఉత్సాహానికి మిక్కిలిగా సంతసించుచున్నాను, వారికృషి చురుకుగా కొనసాగుచుండవలెనని కోరుచున్నాను.

వారు రచించిన 'స' కారసాహిత్య చిత్రకవిత అక్షర విన్యాసమును ఆ మూలాగ్రం చదవగా విన్నాను. అందరూ చేపట్టని ప్రక్రియ, ఒక అక్షరముతో ప్రారంభించి అదే అక్షరముతో అంత్యంచేస్తూ ముగ్గురు సంవాదము కల్పించుట సామాన్యమైన విషయము కాదు. అనన్యం అమోఘం.

ఈ నాలుగు పదాలు వ్రాయుటకు నాకు అవకాశ మిచ్చిన శ్రీ వెంకటేశ్వర్లు గారిని కొనియాడుచున్నాను.

నెల్లూరు
19-12-1991

ఇట్లు
బెజవాడ గోపాలరెడ్డి

Sahitya Vidva Prayeena
Bhasha Praveena
K. Y. Ramanujacharyulu, M A.,
Retd. Principal
Veda & Sanskrit college.
Mulapat. NELLORE - 3 (A. P.)

ప్రజాకవి : శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లుగారు చక్కని వ్యావహారిక భాషాకవి, అనుప్రాస వీరి రచనకు ఊపిరి, వీరు ఇదివరలో "ఎ. సి. రెడ్డి చరిత్ర 'న' కారసాహిత్య చిత్రకవితో అను గ్రంథములను అందముగా రచించి పాఠకుల ప్రశంసలను అందుకొనినారు. ప్రస్తుతము "బ్రహ్మదత్త శాస్త్రి మోక్ష ప్రాప్తి" అను వీరి ఈ రచన త్వరలో ఆంధ్ర పాఠక లోకమును అలరింపనున్నది. ఇది బహురసభరితము. నానా కథాంశ విలసితము. అన్ని దానములలోను అన్నదానము మిన్న అందురు. అన్నదానము వలన కలుగు తృప్తి క్షణికము విద్యాదానము వలన కలుగు తృప్తి శాశ్వతమైనది గదా ?

ఒక దీపము అనేక దీపములను వెలిగించి చీకట్లను తొలగించును. ఇట్లే ఒక విద్యావంతుడు అనేకులను విద్యావంతులను గావించి సమాజమున అజ్ఞానమును తొలగించి విజ్ఞాన కాంతులను నింపును ప్రతి విద్యావంతుడును తాను ఆర్జించిన విద్యను పదిమందికి దానము చేయవలయును. దానము చేయగా చేయగా విద్యా ధనము పెరుగుచుండునే గాని తరుగునది కాదు

విద్యాదానము చేయ సమర్థుడై యుండియు చేయని వాడు "బ్రహ్మరాక్షసుడుగా" పుట్టునని శాస్త్రములు ఘోషించుచున్నవి. విద్యావ్యాప్తికై మన పెద్దలు చేసిన కట్టడి ఇది.

శ్రీ వెంకటేశ్వర్లుగారు ఇట్టి స్ఫూర్తిని మనలో కలిగించుటకొరకే బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి అను ఈ రచనకు శ్రీకారము చుట్టినారు సందేశాత్మకమైన ఈ రచనయందలి విద్యాదానము చాలా గొప్పగా యున్నది.

(రామాయణ కథాఘట్టమున సుగ్రీవుడు రాకున్న, లక్ష్మణునితో శ్రీరాముని ఆవేదన)

వీరి రచనలోని వైచిత్రికి ఒక ఉదాహరణ, శతపుత్ర మిత్ర పుత్ర మైత్ర విచిత్రముగ ఉన్నది కదా! సౌమిత్రీ !- కళత్ర మిత్ర పుత్ర పౌత్రాదులతో వాలి కళత్రతో అపవిత్రుడై- సచ్చరిత్ర పవిత్ర భూపుత్రి నా కళత్రాన్వేషణ రవిపుత్రుడు విస్మరించుట మరీ విచిత్రముగా ఉన్నది కదా! సుమిత్ర పుత్రా! సౌమిత్రీ-

ఇందు గల త్రకార అనుప్రాసము మనోహరమై చదువరులను ఉఱ్ఱూతలూగించుచున్నది. ఇట్టివి ఇంకెన్నో!! రామాయణ కథను నడిపించిన విధానము చదివి ఆనందించవలసినదే. ఇంత సులభముగ ఈ కథ ముగెచ్చుట చూపట్టదు.

పట్టాభిషేక సమారాధనలో వానరుల విందులో చింతవిత్తు కథ కడుపుబ్బనవ్వించును. పాఠకులు స్వయముగ చదివి ఆనందింతురుగాక.

ఇట్లు

కె. యస్. రామానుజాచార్యులు

12-7-1991

# Dr. C. V. SUBBANNA, M.A., Ph. D.,

SATHAVADHANI

PRODDUTUR - 516 360.


శ్రీమాన్ పచ్చారి వెంకటేశ్వరులుగారికి వందనములు. తమరు ప్రేమతో పంపించిన నకారపుస్తక మందినది.

ప్రస్తుతకథ :-

"బ్రహ్మదత్త శాస్త్రి మోక్షప్రాప్తి" "బంగారువర్ణాల విద్యావ్యాప్తి" అను కథ, చదివి తమ ప్రతిభను గుర్తింపగలిగితిని" ముందు వ్రాసిన 'న' కారసాహిత్యం అమోఘం, తమరు సినిమా పాటలు వ్రాసినచో ఈ చమత్కృతి ప్రవేశపెట్టినచో, లక్షలు గడింపగలరు. 'ప్రజాకవి' యనెడి బిరుదును, సార్థకము చేసుకొనగలరు.

హాస్యప్రధానమైన తమ వ్రాతలు జనాదృతి పొందగలవని చెప్పనక్కరలేదు. తమకు "హాస్యకళాప్రపూర్ణ" బిరుదమునిచ్చి లోకము సత్కరించక పోదు.

చిత్తగించగలరు

డా॥ సి. వి. సుబ్బన్న శతావధాని

4-4-1992

# పరిచయము



శ్రీమాన్ కిడాంబి
శ్రీనివాస రామానుజా
చార్యులు
సాహిత్య విద్యాప్రవీణ
M.A. (Sanskrit)
భాషాప్రవీణ

బకసందేశ : సంస్కృత
ఖండకావ్యము

సంస్కృత భాషా ప్రవేశిక-
వ్యాకరణము

హాహా హూహూ : - శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి తెలుగు నవలకు సంస్కృతానువాదము.

ఉల్లేఖ మంజరి- డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి కవితాఖండికలకు సంస్కృత పద్యానువాదము

## శ్రీ భగవద్గీతామృతము

ఆంధ్రమున లఘుటీకలతో అన్ని షట్కములు పూర్తిగావించినారు. వేద సంస్కృత కళాశాల (నెల్లూరు) ప్రిన్సిపాల్‌గా పదవీ విరమణచేసి, శ్రీమదనమోహన మాళవీయ సాహిత్యమండలి అధ్యక్షులుగా యుంటూ- మూలాపేటలో స్వంతభవనములో యుంటూ, సాహిత్య సేవచేయుచున్నారు. ఇంకా ఎన్నో గ్రంథములు సంస్కృతానువాదములు చేసియున్నారు. నా రచన చదివి ఆమోదమును తెలిపిన శ్రీ కె. ఎస్. రామానుజాచార్యుల వారికి నమస్సుమాంజలి సమర్పిస్తున్నారు.

రచయిత
పచ్చారి వెంకటేశ్వర్లు



## రెండు మాటలు


Dr. Amrutavakkula Seshakumar
M.A, M A, M.A , ph,D.
LECTURER
Veda & Sanskrit college.
NELLORE-3


### "బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి"

అనే ఈ పౌరాణిక నవలగా చెప్పదగిన ఐదుగువర్గాల విద్యాప్రాప్తి నుద్దేశించిన చిరుపొత్తంలో ప్రజాకవి సరస హృదయుడు అయిన శ్రీ పచ్చారి వేంకటేశ్వర్లు గారు సామాన్య పాఠకునికి ప్రసిద్ధగాథలు సులభ శైలి భాషలో తెలియ జెప్పాలనే ప్రగాఢ వాంఛతో కొంత నూతనత్వాన్ని మైపూతగ చేసి ఇతిహాస గాథల్ని తనస్వంత బాణీలో చెప్పడానికి ప్రయత్నించారు. చివరిభాగంలో లౌకిక ఫక్కీకలో రచన, వర్ణనలు. కథసాగించారు. మొత్తంమీద పాఠకుని అవగాహన శక్తికి అందుబాటులో ఉన్న గ్రంథం రచయిత అస్తి కథ ధర్మ సరణికి మంచిసోపానమనేచెప్పాలి.

వీరు ఇంకా ఎన్నో నూతన రచనలు చేసి తెలుగు పాఠకులకు అందించే ఆయురారోగ్యాలనివ్వాలని ఆ సర్వేశ్వరుణ్ణి కోరుతున్నాను.


"వీణాపాణి" డా॥ అమృత వాక్కుల శేషకుమార్
నెల్లూరు-3

## డా॥ ఉమామహేశ్వరరావు, M. D. (చీరాల)
## తండ్రి A. పానకాలుగారు

శ్రీ వాణీవాక్ ప్రసాదిత శ్రీయుత పచ్చారి వేంకటేశ్వరకవి పండిత వర్యులకు శుభాకాంక్షలతో తమ కవితా వాగ్ఝురి వినిన ఆనంద పరవశమున సమర్పించిన—

# సు కు మా ం జ లి

క్షీరసాగర మదనమం దావర్భవించిన
హాలాహలము తన కంఠమునందు నిలిపి ఆ
మహేశ్వరుడు అమృత భాగమును దేవతలతో
పాలు నీకును అందించిన ఫలమేమొ మీ / 'న'
కార కవితా చాతుర్యమున- అచ్చులు హల్లులు
పొల్లు దీర్ఘములు అన్నియు అమృత గుళికలై
రసహృదయ లాస్వాదించుచుండె ఇంత
కన్న మానవ జన్మకేమి కావలయు మీపుట్టుక
సాఫల్యమొందె, పద్మకుల శ్రేష్ట పచ్చారి వేంకటేశ్వరా !

మీ ఊహాజనిత కవిత లమోఘము, ప్రధమ-మద్య-అంత్య ప్రాసల ప్రాభవము పంక్తి పంక్తిలో పరిపుష్టినంది కథలో వినిపించిన తీరు నాటి తెనాలి రామకృష్ణుని కవితకుమించె కవితా కళానిధీ పద్మకులశ్రేష్ట ! పచ్చారి వెంకటేశ్వరా !

మీ రచనలు, మీరు, శతాయుష్కులై వర్ధిల్లు వెంకటేశ్వరా !

శు భ ం

చీ రా ల
10-4-92

భ వ దీ య
అరికేటి పానకాలు

ఓం నమశ్శివాయ

రాచగుండ్ల చెంచలరావు
రిటైర్డు డిప్యూటి తహశీలుదారు

వెంగళరావునగర్
కావలి
1[illegible]-10-91

కచ్ఛపీతంత్రి యొకటి మార్గంబుగాగ
భువికి దిగజారినట్టి సత్కవివి గనుక
ఒక "న"కారాన పుటలు నూటికిని మించ
కథ రచించితివయ్యా ! ఎక్కడి రసజ్ఞ !

కట్టెయ్య బొట్టయ్య ఘనులుగా చిత్రించి
బడుగువర్గము వారి పట్టినావు
పలుగునబడిన కమ్మని తేట మాటల
సేద్యపు తీరులు చెప్పినావు
రామాయణాది భారత భాగవత కథ
లింపౌను ప్రాసల నింపినావు
అను సరణీయ గీతాచార్య వాక్సుధల్
దొన్నెలంబట్టి పంచినావు

వటు పవిత్రత వసుధైక ఫలముగాగ
వచన కవితైక సిద్ధి సధ్వాం మొనర్చి
ప్రాస విభవార్థముల కవి ప్రతతిదనిపి
సోమయాజివే అయినావు శుభము నీకు

మనుజ సమతకై భావసంపన్నుడవయి
ఆత్మధృతి అవిద్యా భంజనైక రచన
సంఘ విద్రోహశక్తుల పాలు నిన్ను
విఘ్ననాథుడు మురిసి దీవించు సతము.

— రాచగుండ్ల చెంచలరావు

# నా పలుకులు

కవి హృదయము ఎప్పుడూ ఏదో ఒకటి వ్రాయవలెనని యువ్విళ్ళూరుచుంటుంది. ఆ ప్రేరణే "బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి" బహుపద్యాల విద్యావ్యాప్తి అనే గ్రంథాన్ని సృష్టించుటకు, సంకల్పించినాను, పూర్తిచేసినాను—

శబ్దములు ఎచట నృత్యము చేయునటుల గన్పట్టునో, అచట మాటలు నీటులు గులుకుచూ ముందు వెనుకలకు దుముకుచూ, గంతులిడుచూ సయ్యాట లాడునటుల గానవచ్చును. సంగీతమున రాగాలాపము వలెను, సాగరమున తరంగ సంచయము వోలెను, పద రచనా బంధము క్రమ క్రమముగా హెచ్చుచు, తగ్గుచు, వినువారి చెవులకు విందొనరించును. అదే శైలిలో నుండవలెనని ఊహించి ఈ రచన సాగించినాను.

"ప్రతిభయే కవిత్వ బీజమని, జన్మాంతర గత సంస్కార విశేషమై వెలుగొందు"నని వామనాచార్యులు వచించెను. వారి అమూల్య వాక్యములను శిరసావహిస్తూ — అది నా శక్తిగాదు శారదాదేవి కృపగా భావిస్తున్నాను.

# నవీన కవుల నవీనాభిప్రాయాలు

## తిరుపతి వేంకట కవులు

"వ్యాకరణము ఒక త్రోవకాగా, మహాకవులు మరియొక త్రోవలో నడిచెదరు" అని తిరుపతి వేంకట కవులే చెప్పిరి. వ్యాకరణమును కూడా లెక్కజేయని నిరంకుశులు, ప్రాచీన కవిత్వమునకు భరత వాక్యము పలికి - ఆధునిక కవిత్వమునకు 'నాంది' (ప్రారంభించిన) ఆధునికాంధ్ర కవి ప్రపంచమునకు నిర్మాతలు.

## మహాకవి శ్రీ శ్రీ

"కానిదేది లేదు - కవిత కనర్హంబు
అగ్గిపుల్లా-సబ్బుబిళ్లా-కుక్కపిల్లా
రొట్టెముక్కా-అరటితొక్కా-బల్లచెక్కా
తలుపుగొళ్ళెం-హారతిపళ్ళెం-గుర్రపు కళ్ళెం"

అని ఎన్నో ఉదాహరణలు ఇచ్చినారు-ప్రాచీన కవితలో ఆంక్షే లేఅని నూతనోత్తేజులు. వారిని సర్వదా కొనియాడుచూ, నిర్భయులై నవీన రచనలు చేయుచున్నారు.

కేంద్ర సాహిత్య అకాడమి అధ్యక్షులు
తెలుగుభాషా సమితి అధ్యక్షులు
ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నరు

# డా. బెజవాడ గోపాలరెడ్డిగారు

## వ్రాసిన "ముక్తాలు" చదవండి

"చాలా దేశ భాషల్లో
దుష్ట సమాసాల బెడద పోయింది
తెలుగువారు ఆ పుచ్చిన మూలాలను
పట్టుకొని ఊగుచు పడబోతున్నారు.
తెగిపోయిన సూత్రాలను
పట్టుకొని తెలుగు సాధించిందేమిటి?
కన్నడులు మలయాళీయులు
ముందుకు పోతుంటే!
ఈర్ష్యతో చూస్తూ కళ్ళు నులుపుకొంటున్నారు.
వ్యాకరణ విజయమైయుంటే
భాష పిడసబారి మొద్దకట్టేది.
తేలు కొండెలో విషము క్రక్కుతుంది
కవిమూర్ఖుని నాలుక-పేరాలో క్రక్కురాని విషము"
అన్నారు రెడ్డిగారు.

## మాలతీ చందూర్

"గురజాడవారి 'కన్యాశుల్కం' లోని భాషనే, నండూరివారి 'ఎంకి' భాషనీ సాహిత్యపరంగా అంగీకరించిన పిదప, నెల్లూరీయుల తెలుగు కాదనగల వారెవరు?" అని వ్రాసినారు మాలతీ చందూర్.

## గుడిపాటి వెంకటాచలం

"కవిత్వం వ్రాయాలంటే పదాలు,సమాసాలూ కాదు కావలసింది, ప్రతిభ (శక్తి), ఆత్మ ఔన్నత్యం కావాలి" అన్నారు చలం.

# వ్యాకరణ రచయితలు

"ప్రాచీన కవులు, దుష్ట సమాసాలు వాడియున్నారు. నన్నెచోడ కవి 'నాండు' మొదలగు రూపములను, ఇంకొందరు మహాకవులు, కఱకంఠుడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, దినవెచ్చము! ఇవన్నియు దుష్టసమాసములు; అయినను పూర్వకవులు వాడియున్నారు. మనము వీనిని వాడుకొనవచ్చును. ఇట్టివానినే "అనింద్య గ్రామ్యములు" లందురు" అని అంటున్నారు వ్యాకరణవేత్తలు. ఇదెక్కడి న్యాయమో?

పై పెద్దలను ఆదర్శమూర్తులుగా ఎన్నుకొని- (వ్యాకరణ రచయితలను తప్పించి) వ్యాకరణ విషయమున కొంత స్వతంత్రించి, అర్థస్ఫురణ కొరకు విరామముంచి, అచ్చులను, పరుషములనే ఉపయోగించితిని. సంధి లేనిచోట వచ్చు యడాగమాలకు బదులుగ అచ్చులనే ఉంచితిని. పెద్దలు గమనించగలరు.

"మనమను పలుకులు మనమను
మనుజుని మనమున ములుకులు పలెను జొనిపిన రే
తన మనమెటు కలత పడునొ
అనుకొని మనమున తలచినను మనుజుడు అగున్"

రచయిత



నా గ్రంథానికి అభిప్రాయాలిచ్చిన మహా మేధావు లందరికిన్నీ వందనములు సమర్పిస్తున్నాను—

బ్రహ్మదత్తశాస్త్రి ఫోటోను చక్కగా తీర్చి టైటిలు పేజీ బాంపే స్క్రీన్ ప్రింటుతో ముద్రించి యిచ్చిన, బాపూజీ కాంప్లెక్సు నెం. 8 సి హెచ్. వెంకట వాసువారికి ఆశీర్వాదములు—

ఆలస్యమయినప్పటికిన్నీ ముద్రా రాక్షసాలు రాకుండా, అతి సున్నితముగా ప్రూఫులు దిద్ది, ముద్రించిన నాగార్జున ఎంటర్ ప్రైజెస్ వారికి, నా పుస్తకానికి ధనసహాయ మొనర్చిన దాతలందరికిన్నీ అభినందనలు—

రచయిత

ప్రజాకవి - పచ్చారి వెంకటేశ్వర్లు



# ఇందులో ముఖ్యాంశాలు

* మగవ్యక్తులకైనను విద్య నేర్పుచున్న సత్యలోకములో ప్రవేశించుట
* పురాణాలు: రామాయణ—భారత – భగవద్గీత – భాగవతాలలోని
  సారాంశాన్ని శాస్త్రి—విద్యార్థునకు వివరించుట.
* వరకట్న పిశాచాన్ని మట్టుబెట్టుట
* కులవ్యత్యాస నివారణ
* బడుగు వర్గాల విద్యా వ్యాప్తి
* వరకట్న నిషేధము
* కుటుంబ నియంత్రణ
* సకలశాస్త్ర సంపన్నుడయ్యిన విద్యార్థులు స్వయంకృషితో వ్య-
  వసాయము చేయిస్తూ అధిక పంటలు పండించుట
  పైవన్ని కాలానుకూలముగా వివరించియున్నవి.

రచయిత్రి

# బ్రహ్మదత్తశాస్త్రి మోక్ష ప్రాప్తి
# బడుగు వర్గాల విద్యా వ్యాప్తి
## ప్రథమాధ్యాయము

### పరమ పవిత్ర భారత ధరిత్రిలో

ఆంధ్రదేశ చరిత్ర అత్యున్నత స్థాయిలో వెలుగొందు చున్న దశలో సింహపురికి ఉత్తరదిశలో మూడు యోజనముల దూరమున యజ్ఞేశ్వర పురమనే ఒక గ్రామ ముండెడిది. ఆ యూర నిత్య వేద పారాయణ మొనరిస్తూ ఇష్ట దైవములను తమ స్వాధీనములో నుంచుకున్న మహనీయులు అనేకులున్నారు.

అట్టివారిలో వేదమూర్తుల యజ్ఞనారాయణశర్మ అనేక యజ్ఞయాగాది క్రతువు లొనరించి ప్రఖ్యాతి బడసిరి. వారికి విద్యన్నారాయణశాస్త్రి జన్మించి, పితృ పితామహులతో సమానముగా సకలశాస్త్రములనెల్ల సాంగోపాంగముగా నేర్చి, జ్యోతిశ్శాస్త్రములో ప్రసిద్ధి గాంచెను. వారికి శారదాదేవి వశవర్తినియై యున్నది. భూత భవిష్య ద్వర్తమాన కాలాలను అవసరమైనప్పుడు శాస్త్రిగారి కర్ణేంద్రియాల్లో వినిపించేది.

---

మత రహితుడు గోలుకొండ నవాబు రాజ్యాధిపతిగా నున్న, అబుల్ హసన్ను ప్రజలు తానీషా అనేవారు. ఉదార హృదయుడు, మత భేదాలను పాటించక తెలుగువారైన అక్కన్న - మాదన్నలకు ప్రధాన పదవు లిచ్చినారు.

## "స్తే" అంత్యప్రాస

భద్రాచల తహసీలుదారుగా రామదాసును నియమిస్తే
సర్కారు ధనము రామాలయానికి ఖర్చుచేస్తే
ధనము నగరికి చేరలేదని రాజు శిక్ష విధిస్తే
రామలక్ష్మణులు మారువేషములో వచ్చి పైకము చెల్లిస్తే
భగవంతుడే సాక్షాత్కరించాడని నవాబు తలస్తే

అప్పుడు ఇచ్చారు. భద్రాచలము జాగీరు శ్రీరామ కైంకర్యార్థం శిలాశాసనం వ్రాయించినారు. సీతారామ కళ్యాణ మహోత్సవానికి మంచి ముత్యాల తలంబ్రాలు పట్టువస్త్రములు, స్వయముగా పోయి సమర్పించే వారు. మత రాహిత్యనిరతుడుగా పేరుబొందినారు — తానీషా

దేశపర్యటనకు విచ్చేసిన తానీషాగారు గుడారాలు వేయించిన ఆస్థానములో, రాజాధిరాజులు, సామంతరాజులు, సంస్థానాధీశులు, పండితోత్తములు కొలువుదీరి యున్న సమయమున —

తానీషా :- ఈ ప్రదేశములో ప్రత్యేక ప్రతిపత్తి గలిగిన జ్యోతిశ్శాస్త్ర ప్రవీణులు ఉన్నారని వినియున్నాను. మీలో ఎవరికైనా తెలిసి యున్న తెలుపండని ప్రశ్నించగా —

ఇచ్చటికి నాలుగు క్రోసుల దూరములో యజ్ఞేశ్వరపురమనే యూర విద్యన్నారాయణ శాస్త్రిగారు జరిగినది, జరుగుచున్నది, జరుగబోవునది చెప్పగల దైవజ్ఞులు ఉన్నారని అచ్చటిపండితులు చెప్పగా—

మీలో ఎవరైనా మన స్వేతాశ్వాన్నెక్కి అశ్వరక్షకునితో పోయి, వారి నిటు కాహ్వానించుక రమ్మని చెప్పగా ! - అమృతదీక్షితులవారు పోయి రాజాహ్వానము వివరించగా ! స్నానమాచరించి సరస్వతీదేవి పూజా మందిరమునకు పోయి, కుంకుమాక్షతలు నొసట ధరించి దేవీ ఆజ్ఞతో బయలుదేరినారు. పండిత వేషముతో పంచాంగము చేతబూని పాదూషా గారిని దర్శించి నమస్కార ప్రతినమస్కారములైన పిదప ఉచితాసనము చూపగా ఆశీనులైనారు శాస్త్రిగారు.

అప్పటికే రాజుగారి వామహస్తములో పంచవన్నెల రామచిలుక యున్నది. దక్షిణ హస్తముతో దువ్వుచున్నాడు. అంతకు రెండు ఘడియలకు ముందు ఆటవికుడొకడు ప్రభువునకు శుకమును సమర్పించి బహుమతులు పుచ్చుకొని పోయినాడు.

## చిలుక ప్రాణము

“నే నడిగిన ప్రశ్నలకు దైవజ్ఞులు సమాధానము చెప్పగలరా ?”

“చెప్పగలను ప్రభూ ”

“తప్పిన శిక్ష ఏమిటో తెలుసా ?”

“శిరశ్ఛేదమే ప్రభూ !”

ఒరలో యున్న పిడిబాకును కుడిచేతిలోనికి వాటముగా తీసుకొని ఎడమచేతి బొటనవ్రేలితో, చిలుక మెడ పట్టుకొని “దీనికి ప్రాణమున్నదా” అన్నారు పాదుషాగారు.

“ఉన్నది ప్రభూ !” అన్నారు శాస్త్రిగారు.

తక్షణమే చిరుకృపాణముతో ఒక్క వ్రేటు వేసినారు. చిలుకమెడ తెగుటకు - అది రాజుగారి బొటనవ్రేలు తెగి బొట బొట రక్తం చిందించినది. చిలుక పారిపోయినది. రాజవైద్యుడు రక్తాన్ని అరికట్టి నివారించి

నాడు — మీరు భవిష్యత్ కాలాన్ని వివరించినందుకు సంతోషం. మీ కోరిక తెలివిస్తే తీర్చగలను.

‘‘మా గ్రామములో యజ్ఞయాగాది క్రతువులు నిర్వహిస్తూ వంద కుటుంబాలకు పైగా బ్రాహ్మణ్యం నివసిస్తున్నారు. ఆ గ్రామాన్ని అగ్రహారముగా ప్రకటిస్తూ కొంత భూమిని కేటాయిస్తే ఏ కొరత లేక జీవించగలమని ప్రార్థిస్తున్నాను.’’ అన్నదే తడవుగా ఆ ప్రాంతములో సారవంతమైన భూమి పదివందల యెకరములు ఉన్నట్లు తెలుసుకొని తామ్రశాసనముపై వ్రాయించి శాస్త్రిగారికి సమర్పించినారు. అది మొదలు యజ్ఞేశ్వరపురాగ్రహారమని పేరుతో వెలసినది.

విద్యన్నారాయణశాస్త్రిగారు తమకు సంక్రమించిన భూమిని వంద కుటుంబాల వారి అవసరాలను తీరా యిచ్చి మిగిలిన భూమిని వారు వుంచుకొని మంచి పేరు పొందినారు. గాని — వారికి వచ్చిన విద్యను తన వారికే తప్ప ఇతరులకు చెప్పక, పూజా కార్యక్రమాలు నిర్వహిస్తూ, శేషజీవితాన్ని గడిపి, మరణానంతరం సత్యలోకానికి బోగా —

నీ విద్యను ఇతరులకు చెప్పక నీ కుటుంబానికే పరిమితిచేసి వచ్చినందున అది నీకు శాపముగా అంటుకున్నది. నీవు భూలోకములో నీ కుటుంబములో జన్మించి శనిదశలో నిరక్షరాశ్యుడవై పెరిగి (బుధ దశలో) 16 సం॥ ప్రాయము రాగా ! — నీ వలెనే శాపగ్రస్తుడైన ఒక మహానుభావుని సర్పముగా యున్నవానిని సంహరింపగా వారు ముక్తిబొంది బ్రహ్మదత్తశాస్త్రిగా వెలుగొంది పూర్వజ్ఞానమొచ్చువరకు నీకు బోధించి వారు నా లోకము చేరగలరు. నీవు కుల రహితముగా అందరకు అన్ని విద్యలు బోధించి,జీవితానంతరంఈలోకం చేరగలవు–అని విరించి (బ్రహ్మ) వివరించగానాలుగవ తరములోమనరెండవకథానాయకుడు కట్టిబాబుగాజన్మించినాడు.

విద్యన్నారాయణశాస్త్రికి, విశ్వేశ్వరశాస్త్రి వారికి శ్రీనివాసశాస్త్రి జననమొంది పై తరాల వారికేమీ తీసిపోని వారై కుటుంబ గౌరవాన్ని అధిక్షం

చేయుచూ వచ్చినవారే। శ్రీనివాసశాస్త్రిగారు ప్రజాదరణలోనూ పేరు పొంది సుశీలాదేవితో వైవాహికజీవితం గడుపుచున్నాడు అగ్రహారాధ్యక్షుడు అరువది గ్రామాలకు సభాధ్యక్షుడు అందరి మన్నన లందినవారు - సిద్ధాంతి శ్రీనివాసశాస్త్రి.

అష్టావధాన శతావధానాల్లోను జ్యోతిశ్శాస్త్ర పాండిత్యములోను ఓటమి ఎరుగని ధీశాలి. భరతఖండములో ఏ పండితసభ ఎచ్చట జరిగి వనూ శాస్త్రిగారికి ఆహ్వానమంపేవారు, వీరికున్న పంచకళ్యాణి అశ్వాన్ని అధిరోహించి, వారి బాల్యమిత్రుడు తనతో సమానుడు మేనత్తకుమారుడు మహేంద్రనాథశాస్త్రిగారిని తోడుకొని, సమస్త సారస్వత సభలలోను అఖండ ప్రజ్ఞాపాటవం ప్రదర్శించి ప్రత్యర్థులను ఓడించి గండపెండేర కంకణాదులను స్వీకరించి విచ్చేయువారు. వారు అగర్భ శ్రీమంతులు. కష్టములెట్టివో కలనైనా ఎరుగరు—అట్టివారికి నల్వురూ స్త్రీ సంతానములే. అందుకు చింతించలేదు.

శ్లో॥ యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తున పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః

ఎచ్చటైతే స్త్రీలు పూజింపబడుదురో ! అచ్చట ఉత్తమ విద్వాంసులు, తత్త్వవేత్తలు ప్రకాశించుచుందురు. ఎచ్చటైతే స్త్రీలు గౌరవింపబడరో అచ్చట జరుగు పనులన్నీ నిష్ఫలమగును అనేవారు గానీ — ''అపుత్రస్య గతిర్నాస్తి'' అనే ఆర్యోక్తి ననుసరించి ఒక పుత్రుడైనా లేకపోయెనే అనుకునేవారు.

ఇట్లు గడచిన కొన్నాళ్ళకు సుగుణాలరాశి, సుసీలాదేవి గర్భవతియై పుత్రుని గన్నది. శనిప్రభావం గర్భంలోనే కలిగియున్నందున నేరేడుపండు రంగులో నల్లగా జన్మించినాడు పిల్లవాడు. నామకరణ మహోత్సవము జరిపించి, విద్యాధరుడు అను పేరు నిర్ణయించినారు.

# జాతక ఫలము

తన సొంత పాండిత్యము తానుపయోగించక, జ్యోతిశ్శాస్త్ర విశారదుడు, మిత్రుడు అయిన మహేంద్రనాథ శాస్త్రిగారిని పిలిపించుకొని బాలుని జాతక ఫలము చర్చించుకున్నారు. శనిదశ 19 సం॥రాలు జన్మకు పూర్వమే 3 సంవత్సరములు గడచిపోయినది మిగిలిన 16 సం॥రాలు వీనికీ రూపము పోదు. చదువుసంధ్యలు అమరవు ఇదియొక శాపఫలముగా తోచుచున్నది.

"దశా వివరణ"

16 సం॥ నిల్వయున్న శనిదశ అనర్థ సూచికము

17 సం॥ బుధ దశ ఉచ్ఛస్థాయిలో మహారాజయోగం – నిధి నిక్షేపాలతో షోడశ శశాంక కళలతో రూపమే మారి దివ్యతేజస్సు వచ్చును.

7 సం॥ కేతుదశలో – కార్యజయము – ధనలాభము

20 సం॥ శుక్రదశ – సుఖము – సౌఖ్యము వాహనయోగము

6 సం॥ సూర్యదశ – ప్రజ్ఞ – విశేషాధికారం – కీర్తి

10 సం॥ చంద్రదశ – మాతృబలము – బ్రాహ్మణపూజ

7 సం॥ కుజదశ – ఇష్టవస్తుప్రాప్తి – భూలాభం

18 సం॥ రాహుదశ – ధర్మార్థ – వేదశాస్త్రముల చర్చ

16 సం॥ గురుదశ – గ్రామాధికారము, పుత్రునివలన సుఖము, సంతోషం

117 సం॥ ఆయుర్దాయము కలిగి, భూలోక సౌఖ్యము లనుభవించి స్వర్గప్రాప్తి నొందగలరు. అంతర్దశలు మారిననూ దైవబలము వలన అన్నీ మేలు చేయునట్లు శాస్త్రము చెప్పుచున్నది.

శని బలవంతుడైయున్నాడు అనేక దుర్గుణములు చేయును. ప్రక్కదారులు త్రొక్కించక యుండుటకు శాంతి చేయవలయును. తిలదానము నిచ్చి – 19 వేల జపము లాచరించి ఈ క్రింది శ్లోకము పఠిస్తూ

శ్లో॥ నీలాంజన సమభాసం రవిపుత్ర యమాగ్రజం । ।
ఛాయా మార్తాండ సంభూతం తన్నమామి శనైశ్చరం

ఈ శ్లోకాన్ని జపమాచరించి నివారించవచ్చును. నేను నిష్ఠాగరిష్ఠతతో నెరవేర్చగలను. జపములు పూర్తి అయినరోజు సకలజనప్రీతిగా అన్న వస్త్ర దానములు చేసి, సర్వజనాశీర్వాదము పొందిన దోషనివారణ జరుగును. అనుకొనిన విధముగా అన్నీ జరిగిపోయినవి.

## అక్షరాభ్యాసము

అబ్బాయికి పంచవత్సరముల ప్రాయమురాగా (5 సం॥) అక్షరాభ్యాసము చేయించుటకు బాలునకు అభ్యంగనస్నానమొనర్చి మహేంద్రనాథ శాస్త్రిగారిని రావించి, బంగారుపళ్ళెములో మంచిముత్యాలునింపి శాస్త్రిగారి యెదుటవుంచి నమస్కరించి బాలుని ప్రక్క కూర్చున్నారు దంపతులు.

"ఓం" అని వ్రాయించుటకు చేతులు తిరుగలేదు, నోరు పలుకలేదు శతవిధాల చూచినారు శాస్త్రిగారు. విధిని అతిక్రమించుటకు వీలులేక ప్రయత్నం విరమించుకున్నారు. బంగారుపళ్ళెంతోటి ముత్యాలు తీసుకొమ్మని ఎంత చెప్పినా తీసుకొనలేదు మహేంద్రనాథశాస్త్రి. తర్వాత వారింటికి చేర్చినారు శ్రీనివాసశాస్త్రిగారు.

పుష్కరకాలము రాగా (12 సం॥రములు) కొన్ని కొన్ని చిన్న పదాలు పలుకుచున్నాడే కానీ అన్నీ రావు. నల్లజాతి పశువులపైన అభిమానము మెండు. ఇంటనున్న నల్లబఱ్ఱెకు నీళ్ళుపెట్టుట, మేతవేయుట, దాన్ని కట్టివేయుట వాని దినచర్య. క్రమేణా ఆ బఱ్ఱెను మేతఉన్న పొలానికి తోలుకొని పోయి దాన్ని బాగా మేపుకొని శుభ్రంగా ఒళ్లు కడుగుకొని గాట కట్టివేస్తే వాని కానందం.

## పండిత పుత్రః శుంఠః

పండిత పుత్రుడు, అష్టైశ్వర్యముతో తులతూగవలసిన తనయుని గని తల్లి శోకించి విలపించేది. నల్లగాయున్న బాలుని ఊరివారు "కట్టి బాబు" అని పిలుచుట వాడుకై పోయినది.

మేనత్త కుమార్తె పెండ్లి జరుగుతుంటే తండ్రి యచటకు పోయి వుంటే, నేను పోతానని తల్లితో అంటుంటే 16 సంవత్సరముల ప్రాయము వచ్చినా పలుకుటకు సరిగా రాదు.

'అమ్మా ! అమ్మా ! మట్టిపాడులో యుండే
బుట్టెమ్మత్త (భూదేవి) కూతురు (శ్రీదేవి)
చిట్టెమ్మ పెట్టికి పోతానే పంపించమ్మా
కట్టిబట్టె నెవరన్నా పిట్టోడికి చెప్పితోలమ్మా ॥

తల్లికి కోపశోక మిళితమై (వ్యంగ్యంగా) మట్టిపాడు పెట్టికి పోతాడటనే పిట్టోడు.

## "ట్రే" అంత్యప్రాశ

"అచ్చటికెందరో మహాపండితులు విచ్చేసియుంటే ;
నీ వెళ్లి నీ తండ్రి ప్రక్కన ఒరిగి నిలుచుంటే
"వీడా నీ కొడుకని" ఎవరైనా ప్రక్కవారు అంటే
"పండితపుత్రః శుంఠః" అని గిట్టనివారు అంటే
ఆ ప్రక్కవారు ఒకరికొకరు చెప్పుకొని నవ్వుకుంటే
నీ జనకుని నయనమ్ములు జలమ్ములు కారుచునుంటే
ఆ దృశ్యాన్ని నీ కనుల చూడవలెనని యుంటే పోరా పో"

"నీ పితృదేవు లెట్టివారో! నీ పెరుగుదువా? స్వగ్రామాధ్యక్షుడు, అనేక గ్రామాలకు సభాపతి. వంద గ్రామాలకు శతపతి. చతుర్వేదము లను చక్కగా బోధించగల చతురులు. మహాపండితులనైనా, అవలీలగా జయించగల శక్తి-యుక్తి-సంపన్నులు. అట్టి వారున్నచోటుకు నీవెళ్ళ టకు వీలులేదు."

## ది అంత్యప్రాస

గడ్డకట్టిన నీ కజ్జె బజ్జె పెరుగు ఉట్టిపై నున్నది.
సరిది యన్నము అచ్చటనే మూత పెట్టియున్నది.
గడ్డపెరుగు పుల్లగా కలిపి ఊజ్జుకొమ్మన్నది.
కజ్జ చేతబట్టి నీ బజ్జెను తోలుకొని పొమ్మన్నది.
వాని మనస్సెరిగినతల్లి వాని భాషలోనే చెప్పినది.

చెప్పినదే తడవుగా [కజ్జచేబూని బజ్జెను తోలుకొని బయలుదేరి పోయినాడు కజ్జిబాబు.

కుమారుని పంపిన తల్లి చింతతో-

## ట్లు అంత్యప్రాస

"పండిత వంశములో పామరుడు జన్మించినట్లు
రత్నాల రాసుల్లో గులక రాళ్ళున్నట్లు
వంశాంతరములో వక్రబుద్ధివా డుదయించినట్లు
సుక్షేత్రములో పనికిరాని ఫలము లుద్భవించినట్లు
సాలగ్రామ విగ్రహము లున్నచోట బండరాళ్ళున్నట్లు
బంగారు వంగడమున వెంగిలి (అవివేకి) పుట్టినట్లు

మా కేల జన్మించితివిరా ! తండ్రీ!! " అని శోకించి—శోకించి—శోషించి! అచ్చటనే నేలపై పడిపోయినది తల్లి.

కళ్యాణ మైపోగానే పంచకళ్యాణి అశ్వముపై బయలుదేరి వచ్చినారు శాస్త్రిగారు. పరిచారికలు సేవలు చేయుచున్నారు. పలుకలేకున్నది సుశీలాదేవి. ఆ దృశ్యాన్ని చూచి వర్త నిశ్చాంత పోయినారు. శీతోదకము ముఖముపై చిలకరించి, శైత్యోపచారములు చేసి, చల్లగా, సుశీలా! అని చెవియొద్ద పిలిచినారు. పతి పలుకును గ్రహించిన సతి కొంత స్పృహ వచ్చి కనులెత్తి ప్రాణపతి మోము తిలకించగా!

నిర్మల మనస్కురాలైన, సుశీలా! నీవా! నిస్పృహ జెందుట? నీకున్న మనః క్లేశము నాకు లేదనియా ! ఉన్నది, ఏమి చేయుదుము. మనము చేసిన జపతపః పూజాఫల విశేషమున మన బాబుకు దుర్బుద్ధి-దుష్ట సాంగత్యం-జూదము-దొంగతనములలవడక వానికి తోచిన పనిలో నిమగ్నమై పోవుచున్నాడు అందుకు సంతోషించక కంటనీరు కడవల కొద్దీ కార్చుచున్నావు, మంచిదికాదు.

"కలకంఠికంట కన్నీరొలికిన సిరి యింట
నుండనొల్ల" దన్నారు సుమతీకారుడు.

శనికి అంత్యదశ ఈ రోజుతో పూర్తగును. బుధ దశ వస్తుంది వాని దశ మహర్దశగా మారవలయును.

"పెద్దను అనరాని మాట లన్నానండీ ! ఈ ఉదయం ! నా పాప పరిహారం ఏమైనా చెప్పండి స్వామీ!" అంటూ కంటనీరు తుడుచుకున్నది సుశీలాదేవి.

"అదంతా శనిప్రభావమే సుశీలా ! నీ వేమి చింతించ పనిలేదు అదిగో వచ్చుచున్నారు మీ అన్నగారు. మహేంద్రనాథశాస్త్రిగారు వారంతా చూచి చెప్పగలరు. నేనేమీ చెప్పజాలకయున్నాను. బాబు

శాప విమోచన మైనట్లు నా మనస్సు చెప్పుచున్నది ఆ సంతోష వారధిలో మునిగి తేలుచున్నాను.”

మహేంద్రనాథశాస్త్రి :- అమ్మా! మీరెందుకింత వ్యాకులత చెందుట. అమ్మాయికి షోడశాబ్దములు (16 సం॥) పూర్తయినవి. శని దశ పోయి బుధ దశ ఈ రోజు మధ్యాహ్నాత్ పూర్వమే ఆరంభమైనది. ఇక మహర్దశ రావలెను. శాస్త్రిగారు జాతక ఫలాన్ని పరిశీలించి చెప్పగా కొంత మనస్సు ఉపశమనము కలిగినది తల్లి సుశీలాదేవికి.



# చిత్ర కవితా విన్యాసము

## కట్టిబాబు

కట్టె నొకటి చేతబట్టి బట్టె నొకటి తొలుకొనుచు
కట్టిబాబు వచ్చి వచ్చి మట్టి చెట్టు దరికి చేర
మట్టి చెట్టు తొఱ్ఱలోకి జెట్టిపోతు పోతువున్న
కట్టిబాబు నటకువచ్చి జెట్టిపోతు తోకచూచె.

చూచినోడు ఊరుకోక పెట్టివాడు కట్టిబాబు
కఱ్ఱనట్టె పైకి ఎత్తి జెట్టిపోతు తోకపైన
వేసె నట్టె ఒక్కవేటు ఏటు దెబ్బ తాళలేక
మట్టిచెట్టు తొఱ్ఱలోకి చఱ్ఱ చఱ్ఱ పారిపోయె!
జెట్టిపోతు తోకముడిచి తొఱ్ఱలోకి పూర్తిగాను
జెట్టిపోతు పోవచూచి గట్టిగ పగ పట్టినట్టుందని,
కుట్టో యని మొట్టో యని వెఱ్ఱివాడు
కట్టిబాబు ఏడ్పుట కుపక్రమించె.
తాటిబుఱ్ఱ తెరుచున్న గుఱ్ఱం బొఱ్ఱయ్య చూచి
"ఎందుకురా! కట్టెయ్యా! కఱ్ఱనొక్క చేతబట్టి
బుఱ్ఱనొక్క చేతబట్టి మొట్టోయని కుట్టోయని
ఏడ్చుచుండి" వేమనగా!
"ఏమని చెప్పుదు గుఱ్ఱం బొఱ్ఱయ్య మామా!
బుఱ్ఱ లేక నేను ఒక్క వెఱ్ఱి పనిని చేసినాను

బొజ్జయ్య మామా!" జే...జే...అని ఏడ్చినాడు.
"ఒరే కట్టెయ్యా ఎట్టా చెప్పే దెట్టా చెప్పేదని
నెట్టుక చావక చెప్పన్నా ఏడవరా!
ఏడ్చన్నా చెప్పరా వెజ్జిబాగులోడా!"

"చెప్తతా విను గుజ్జంమామా! చేసిన తప్పును చెప్పక తప్పదు
కజ్జనొకటి చేతబట్టి బజ్జినొకటి తోలుకొనుచు
మజ్జిచెట్టు దరికిచేర జెజ్జిపోతు లొజ్జలోకి!
బుజ్జి బుజ్జి పోయి పోయి తోక కొంత మిగిలియుండె
నా దారిన నేను బోక వెజ్జివాణ్ణి తోకపైన ఒక్కవేటు వేసినాను.
కర్రతోటి దానిపైన, బొజ్జయ్య మామా" (జే...ఏడ్చెను).

"తప్పక పగపట్టుందని సీపని పడ్తుందని!
గొజ్జెల మీపుటకు పోవు యజ్జయ్య నాకు చెప్ప
వాని మాట విన్నంతనే! నాలుక తడి ఆరిపోయె.
నా బాధను చూడలేక సొరబుజ్జలోని నీరు
నాకు కొంత పోసినాడు తనదారిన పోయినాడు.

పగపట్టుందని చెప్పగనే భయము నాకు అధికమాయె
ఇక బతికే దెట్టా మామా! గుజ్జం బొజ్జయ్య మామా!" (జే...ఆ...
ఏడ్చెను.)

"దిగులుపడకు కట్టెయ్యా! దీనముగా ఏడ్వబోకు
ఒరులమనసు కలత జెంద నాదు మనసు కరిగిపోను
చెప్పెద నేనొక్కుపాయము కాదనక నామాటను ఈ పూట,
బుజ్జిపెట్టి యోచించితి బుద్ధిగ విను నాదుమాట
కజ్జిపట్టుకొని కదలిరా నావెంట! మజ్జిచెట్టు చుట్టు తిరిగి
గుట్టుతెలిసి రట్టుబెట్టి మట్టుబెట్టు దము రా!"

# త్రి మధ్య అంత్యప్రాసలు

చెట్టు చుట్టు తిరుగు నంత చేరువలో నొక్కకంత
పట్టిబట్టి చూచునంత కనిపించెను చిన్నకంత
దాన్ని బట్టి యోచించితె తోచెను యోచనకొంత
చేరిరి ఎంపుగడ్డి ఉన్నయట్టి గుబురు చెంత
కోసిరి మోపెడంత మోసిరి మోపునంత
పేర్చిరి చెట్టుచెంత కాల్చెద మనుకొనునంత
రగుల్చుటకు లేదు అగ్గి రవంత ఆ చెంత
రాయిని రాయికి కొట్టునంత రవ్వలు రేగెనుకొంత
ఆ రవ్వలనే మంటగ సేసినంత, మండెను కొంత
"అది అంతై ఇంతై వటు డింతై" అన్నట్లు రేగెనంత
ఆ మంట పెట్టంత, మట్టితో కొట్టి మాన్పిరంత
పొగబెట్టిరి ఊపిరి బెట్టిరి మరికొంత
ఆ పొగసంతయు తొఱ్ఱలోకి ఊదిరంత
పొగదెబ్బకు తాళలేక జెఱ్ఱిపోతు అంత
పుట కంతలో తొంగి చూచి తల బయట పెట్టెనంత
చెట్టు చుట్టు తిరుగు చున్న కఱ్ఱెయ్యను

పొఱ్ఱెయ్య చూచి "వేయరా! కఱ్ఱెయ్యా!
దాని బుఱ్ఱపైన బలముకొద్ది ఒక్కొ"టన!
వేసె నట్టె ఒక్కవేటు కఱ్ఱనెత్తి జెఱ్ఱిపోతు బుఱ్ఱపైన
బుఱ్ఱపగిలి చిట్లె పుఱ్ఱె చితికి పోయె దానిబుఱ్ఱ.
చచ్చిన సర్పాన్ని బలముకొద్ది లాగినాడు.
దాప అల్లుడు బయటికె, బార బారన్నర యున్నది.
బయటికి లాగిన బలమైన బహుపెద్ద సర్పము.

"సర్పాన్ని చంపుట పాపమురా! పగబట్టిందని చంపించితె
పాపము పోవుటకై, నే నొక్కుపాయము చెప్పెద విను
అనాథ ప్రేతాన్ని దహనమొనర్చిన కలుగు పుణ్యమ్మని,
చెప్పుదురు పెద్దలు చేసెద మట్టుల పోవును పాపము
తెమ్మర కట్టెలు ఇమ్మర నాచేతికి త్వరగా! రమ్మ!
కమ్ముచున్నవి మేఘమ్ములు కలుగు మనకు పుణ్యమ్ములు"

"కట్టెలు లేనట్టున్నవి ఎట్టా చేస్తను దొబ్బయ్యమామా!"

ఒరే కట్టయ్యా !

## ది అంత్యప్రాస

ఆ ప్రక్కన శ్రీగంధపు చెట్టున్నది
దానికొక తట్టు ఎండు కట్టున్నది
అవి కొట్టుటకు నా చేత గొరసకత్తున్నది
ఈ సర్పము దేవతా సర్పములా గున్నది
శ్రీగంధపు చెక్కలలో దహనమొనర్పమన్నది
స్వర్గ ప్రాప్తమ్మని శాస్త్రము చెప్పుచున్నది
రారా! కట్టయ్యా! నా వెంటరా! అంటూ పోయిరి.

## రి ప్రాసానుప్రాస

చెట్టెక్కిరి ఎండుకట్టెను విక్కువగా కొట్టిరి
మోపులు కట్టిరి కాటికి తెచ్చిరి దుగ్గనన తెచ్చిరి
అడుగున పెట్టిరి తెచ్చిన కట్టెను వరసగ పేర్చిరి

బట్టెను పితికిన పాలును తెచ్చిరి దేవత సర్పము దేహము తడిపిరి
ఊదరపెట్టిన అగ్గింపే తెచ్చిరి ఊదిరి మంటను చేసిరి
కట్టెనొకటి బాగాకొచ్చిరి ఆ కట్టెను శిరస్సుక్రింద పెట్టిరి
కాష్టమునంతా పూర్తిగా తగలపెట్టిరి
వేదిక చుట్టూ తిరిగిరి నీళ్ళొదిలి పెట్టిరి
ఢగ ఢగ మని పెద్ద మంటను రేపిరి
ఆ మంటలలో రేచిన తేజః పుంజము చూచిరి
అంతట పోయిరి చెరువులో స్నానము చేసిరి
ఆవరించిన ఆ ప్రకాశం ఆంధ్రలో చూచిరి
ఆ వింతను చూచుట కచ్చటనే కూర్చుండిరి

వటవృక్షచ్ఛాయల్లో ఊతల దరిదాపుల్లో కాళ్ళు వంగని కట్టెయ్యా! బొజ్జవంగని బొజ్జయ్యా! బొజ్జయ్యటు మూర్చొందెను-కట్టెయ్యటు కూర్చుండెను.

# పచ్చారి రచన ప్రథమ అధ్యాయము పూర్తి



# ద్వితీయ అధ్యాయము ప్రారంభం

# అగ్ని తేజః పుంజము నుంచే ఆవరించె ఓం...కారము

## 'బ్రహ్మదత్తస్వామి'



ఓం ... పరబ్రహ్మణేనమః

ఓం ... విష్ణవే నమః

ఓం ... శివాయ నమః

ఆ ఓంకారనాదము కిన్నెర స్వరముతో దశదిశలకు, బ్రహ్మ-విష్ణు-పరమేశ్వర లోకాలకు వ్యాపించి, సృష్టికర్త కర్ణేంద్రియాలలో మృదు మధురంగా సోకినది. "ఈ మధురమైన స్వరము సుపరిచితమైనదే!?" అని నిమీలిత నేత్రుడై కనులు మూసికొని యోచించుచున్న యప్పరమేష్ఠితో వాగ్దేవి చెప్పినది- "మీ దత్తపుత్రుడని పేరుంచుకున్న బ్రహ్మదత్తశాస్త్రి"గారిదని. అప్పుడు స్ఫురణకు వచ్చినది అనంతకోటి జీవరాసుల సృష్టిలో లీనమైయున్న పరబ్రహ్మకు.

అప్పుడే పిలిపించినాడు సత్యలోక విమానాధ్యక్షుణ్ణి. "సుధాకరా నీవిప్పుడేపోయి మర్త్యలోక పుణ్యభూమి యైన భారతావనిలో, కృష్ణా-

కావేరి మధ్యభాగాన, ఆనందమయమైన ఆంధ్రదేశములో ఒక మహా వట వృక్షచ్ఛాయల్లో మల్లె పూదల ఊయల్లో ఆసీనుడైయున్న మహాతేజశ్శాలి బ్రహ్మదత్తస్వామికి నమస్కరించి-వారి అనుమతితో, సూర్యాస్తమయము నకు పూర్వమే, మనలోకానికి వచ్చునట్లుగా చూడుము. నీతో సుశిక్షితులైన ఇద్దరును మన దూతలను దీసికొనిపొమ్ము. వాయుదూత దివ్యాచలో మార్గము చూపించును - వేగమే పొమ్ము - వారి అనుమతితో రమ్ము."

అట్లెయని లయానికి నమస్కరించి బయలుదేరినారు క్షణకాలములో విమానము శాస్త్రిగారి సమక్షములో నిలిపి - చూడగా వారు నిశ్చల మనస్కులై, జపమాచరించుచున్న బ్రహ్మదత్తస్వామిని జూచి, "మన కదలికవలన శ్రీవారికి జప భంగ మగునేమో!" యని తలచి అదృశ్యరూపులై అచ్చటనే నిలిచి చూచుచున్నారు.

* * *

సమీప మల్లెపూదలు ఒకటి కొకటి పెనవైచుకొని భూదేహికి మూడడుగులపైన ఊయల నేర్పరిచి "రండి! మాపై ఆసీనులు కండి!" అనునట్లు చిన్నగా ఊగుచున్నవి బంగారు కాంతులీనుచున్న మల్లెపూవులు. అందు ఆసీనులైయున్న బ్రహ్మదత్తస్వామిని వర్ణించుకొను చున్నారు బ్రహ్మచారులు.

## స్వామి వర్ణన

దివ్యసుందర విగ్రహుడు, బ్రహ్మ వర్చస్సుతో సమానమయిన ముఖవర్చస్సు-విశాలమైన చల్లని నేత్రములు విష్ణుచ్ఛాని విల్లుతో పోల్చు కనుబొమలు-పండితులు మెచ్చదగిన నాసికాగ్రము-దొండపండు వంటి అధరములు-మల్లెమొగ్గలతో సమానమయిన దంతములు-అప్పుడే క్షుర కర్మ చేసినట్లున్న ఉన్నతమయిన గడ్డము-శిరస్సుపై మధ్య భాగమున

రజతపర్ణములతో నిగనిగలాడు పాల్మిడి-చెవులకు అందాన్నిచ్చే కర్ణకుండలములు-భవ్యకాంతితో యజ్ఞోపవీతము - సువర్ణమిశ్రితమై కంఠమునుండి నాభివరకు మెరయుచున్న రుద్రాక్షమాల-ముద్దుగొలుపు ముంజేతి హస కంకణములు-చక్రవర్తులచే సత్కరించబడి కాలికి తొడిగిన గండపెండేరము-నవరత్నములు పొదగబడిన అంగుళీయము - పండిన ఎరుపులో పచ్చిపసుపు ఛాయ కలసిన, జలతారు అంచుగలిగి, పింజపోసి మొలకు ధరించిన దోవతి-వల్లెవాటుగా వేసుకున్న కాశ్మీర దుశ్శాలువ-నిశ్చల నిర్మల మంత్రోచ్చారణకు నియమించుకొన్న రుద్రాక్షమాలను నిమీలిత నేత్రుడై, దక్షిణహస్త అంగుష్ఠ చూపుడువ్రేళ్ళతో త్రిప్పుచూ, జపమాచరించుచున్న మహాపురుషుని వర్ణించుకొనుచున్న కమలాసనుని ప్రత్యేక దూతలను, జపము పూర్తి అయినవెంటనే చల్లని మెల్లని నయనమ్ములతో ఆత్మ పరిశుద్ధిగల మహామేధావి వారి అదృశ్య రూపములను తిలకించి- "అయ్యలారా!-విధి నాకువిధించిన విధానమును వివరించెద వినుడు. నాకు వచ్చిన విద్యలన్నియు, సాంగోపాంగముగా కాకున్నా, సంక్షిప్తంగానయినా ఈ మహనీయునకు (కట్టిబాబుకు) వివరించవలసి యున్నది. అంతవరకు భూలోక వింతలు విశేషాలు తిలకించుకొని రండు. ఇక పదునైదు ఘడియల కాలమున్నది. శతపత్ర మిత్రుడు అస్తమించకముందే బయలుదేరవలయును" అని చెప్పగా సెలవుదీసుకొని అదృశ్యరూపులై దేవ విమానములో కదలిపోయినారు దేవదూతలు. (మర్త్యలోక మాయా మర్మములను తెలిసికొనుటకు)

*　　　*　　　*　　　*

"అయ్యా! విద్యాధరశాస్త్రీ!" [కట్టిబాబు మొదటిపేరు] అన్నదే తడవుగా కను ఎత్తి చూచినాడు కట్టిబాబు, పూర్వజన్మ స్పృహ పొడచూపుచుండగా!

"ఆర్యా! నా తలపందించిన నా దేహము మరియు మరలన్ పూర్వ పుణ్య ఫలములు గలగెన్.

నీ ప్రసాదముచే పాప నికరమడిగి
పూర్వజన్మ విజ్ఞానంబు వొడమె మదికి
చెప్పు మనినను సర్వంబు జెప్పగలను
భూసురోత్తమా! ఏమి నా పుణ్యఫలము

అయ్యా! నే నొక సద్ బ్రాహ్మణ వంశంలో జన్మించి సకల విద్యా పారంగతుడనై, చతుర్వేదములు షడ్శాస్త్రములు వాల్మీకి-వ్యాస-కాళిదాసాది మహాకవులు రచించిన రామాయణ - భారత - భగవద్గీత-రఘువంశము-భరతుని నాట్యశాస్త్రము-విశ్వేశ్వరుని అలంకార శాస్త్రము-పతంజలి మహర్షి రచించిన శబ్దశాస్త్ర వ్యాకరణము ఇన్ని అన్ని అని చెప్పుటకు వీలులేనన్ని సంస్కృత పురాణేతిహాసములను చదివి, అవగాహన చేసుకొని కొన్నింటికి వ్యాఖ్యానాలు వ్రాసి మరి కొన్నింటిని నేను స్వయముగా రచించి వందశాస్త్రిలను సర్వంసహా పఠించి నిష్ఠాగరిష్టతతో సంధ్యావందన, దేవతార్చన, పూజా కార్యక్రమాలను నియమ నిబంధనలతో ఆచరిస్తూ సరైన శిష్యులు లేక నా విద్యను ఎవ్వరికిన్ని ధారాగతము చేయలేక బోయితిని.

నేను అజన్మ బ్రహ్మచారిని. స్వయంపాకముతో కాలము గడిపితిని. వయోవృద్ధత్వ మాపాదించగా, జరాభారముతో నున్న తరుణములో నన్ను చరించి యున్నవారికి మడిమాన్యాది స్థిరాస్తులన్నీ చెందునట్లుగా యొప్పగించి-

ధన కనక మణి మాణిక్యాదులు అమూల్యమైన తాళపత్ర గ్రంథములు తామ్రమందసమందుంచి పశ్చిమదిశలో ఇచటికి క్రోసు దూరములోయున్న ప్రాచీన శివాలయంలో భూస్థాపితమొనర్చి నామంత్ర శక్తిచే నొక నాగును నియమించి, "ఏ యుత్తముడు బ్రహ్మదత్తశాస్త్రి నిధి నిమ్మని వేడుకొనునో, వాని కే యాటంక మొనర్చవద్దని ఆదేశించితిని. ఆ నిధినిటకు తెమ్ము - అంత బరువైన మందసాన్ని నేను తేగలనా? అనుకొను చున్నావు. అది నీ శక్తిగాదు. దైవశక్తి. బొజ్జయ్య స్వ్రహా

తప్పి యున్నాడు. నీవే పోయి తెమ్ము. వేగమే రమ్ము. ఈలోగా కొంత జపమైనా పూర్తిచేయుదుసు."

*        *        *        *

ఆ నిధిని తీసికొనివచ్చి ఎదురుగా కూర్చొనియున్న విశ్వాస పాత్రుని జపమైపోగా చూచి – సత్యలోక సంభాషణ చెప్పుచున్నాడు బ్రహ్మదత్తశాస్త్రి. నా గతజన్మలో బ్రహ్మనిష్ఠతో ముప్పొద్దులా పూజా కార్యక్రమాలు జరుపుచున్నందున, ఇహలోకయాత్ర చాలించిన వెంటనే కమలోద్భవుని మాతలు బ్రహ్మలోకానికి దీసికొనిపోయి, కమలాసనుని ఎదురు నిలపగా, ఉచితాసనముపై కూర్చుండ నియమించినారు.

అచ్చటనేయున్న నేర పరిశోధకులు నా పాప పుణ్యాలను విపులీకరించినారు. అది విని విరించి వివరించిన విషయం చెప్పెదను. వినుము.

"నీకు వచ్చిన విద్యను భూలోకవాసులకు ఏ ఒక్కరికిన్ని చెప్పక యున్నందున అది నీతోనే అంతమైపోయినది. లోకప్రఖ్యాత తాళపత్ర గ్రంథములన్నీ భూస్థాపితముజేసి వచ్చియున్నందున అవి అన్నియూ నిరుపయోగమై నిలిచిపోయినవి. తామ్ర మంజసమందుంచిన సువర్ణ మణిమాణిక్యాదులు ఏ సత్ కార్యమునకు ఉపయోగించక నిలిచి పోయినవి. చదువు విషయం సహించరానిది. దీనికి పరిహారంగా నీవు మర్త్యలోకములో సర్పజాతిలో పుట్టవలసియున్నది."

బ్రహ్మ చెప్పిన వేదవాక్కును కాదనలేక నిరుత్తరుడై నిలిచి పోయినాను బ్రహ్మదత్తశాస్త్రి. "ఇంకేదయినా సవరణ"వుంటే చూడమని సలహా చెప్పినది సరస్వతీదేవి.

"దేవీ! ఇది భూలోకముగాదు, సవరణచేసుకుంటూ తనవారికి సహాయము చేసుకొనుటకు. సత్యలోకములో సవరణలకు తావులేదు. నీకున్న వ్యధ నాకూ యున్నది. నా దత్తపుత్రుడుగా పేరిడుకొని త్రికాల సంధ్యాసమయాల్లో నిష్ఠాగరిష్టగా నన్నే పూజించిన వానికిన్ని.

నిస్సహాయుడు చేయజాలడు. విధి వ్రాతను తప్పించుకొనుటకు విధికైననూ తరము గాదు." "నాగుపాము త్రి శబ్దమనుకుంటే జెట్టిపోతుపై జన్మించును-బ్రహ్మదత్తా" అని చెప్పెను.

"నాకు ముక్తి మార్గము లేదా? స్వామి!" అన్నాను. "ఎందుకు లేదు! వున్నది. నీకు తెలియకనే మూడువందల యేండ్లు గడచిపోవును. నీవొకడవై యొక పండితోత్తముని నియమించు కున్నాను. వాని నేర మేమున్నదో? తనకు వచ్చిన విద్యలనెల్లా తన వారికే చెప్పి సంకుచిత బుద్ధితో, యితరులకు బోధించక పోవడమే.

తన పండిత వంశములో కనివశలో జన్మించి షోడశాబ్దాలు (16 సం॥) కష్టనిష్ఠురములు అనుభవించి, బుధవశ ఆపాదించగా నిన్ను సంహరించును నీకు దైవత్వ మాపాదించును. నీకు వచ్చిన సర్వశాస్త్రములను సంక్షిప్తముగానైనా వానికి విపులీకరింపుము. పూర్వ జన్మలో ఉద్దండ పండితుడు గనుక వెంటనే అవగాహన చేసుకోగలడు. నీ భూస్థాపిత గ్రామ మందున్నవి అతని స్వాధీనపరచి, నీ అముద్రిత గ్రంథాలను జనోప యోగమగునట్లు చేయుమనుము. అట్లు చేసిన నా నా ధర్మ నిరతులకు కలుగు యుత్తమ లోకంబులు నీకుం గలుగుగాక!" యని దీవించి వివరించగా, విన్నాను. ఇదే నా గతజన్మ కథ."

"నీ గతజన్మ వృత్తాంత మున్నా విపులీకరించి యున్నారు. నీవు సామాన్యునిగా భావించకుము పూర్వజన్మ పరిజ్ఞానము వలన అతి సులభగ్రాహివై తెలుసుకొనగలవు. నీ మనోగతాన్ని నే నవగాహన చేసికొని చెప్పగలను. ప్రశ్నించవలసిన పనిలేదు. కాలము కొంత కలసి వచ్చును.

సావధాన చిత్తుడవై వినుము :

జీర్ణావస్థలోనున్న యీ ప్రాచీన దేవాలయాన్ని పునరుద్ధరించి అందు కొందరికైనా గృహావసతి, భోజనవసతి ఏర్పరచి, నిత్య ధూప దీప నైవేద్యాలతో పూజించునట్లు చేయుము. సువిశాలమైన తటాకమును త్రవ్వించి, నందనోద్యాన వనముతో సమానమైన యొక యుద్యాన

వనాన్ని పెంచుము. సువాసనలుగల లతాదుల పెంచి, పుష్పించి పరిమళించి, మహా సువాసనలతో గుభాళించుచుండును దేవతార్చనకు కావలసిన పుష్పములను అచటనుండియే అర్చకులు సేకరించుకొందురు.

## సుందర గృహము నిర్మించుకొనుము

అధునాతన రీతితో, సప్తసోపానములతో, నివాస యోగ్యమయిన సుందర సువిశాలమైన మహా సౌధాన్ని నిర్మించుకొనుము. అందు ఒక గృహప్రదేశమె నీవిప్పుడున్న గృహాన్ని ఆదర్శవంతమైన గురుకులా శ్రమమొనర్చి, సర్వశాస్త్రాలను బోధింపుము. విద్యార్థులకు అన్న వస్త్రదానాలొసంగి నివాస యోగ్యమైన వసతులు ఏర్పరచుము.

నిరక్షరకుక్షినైన నేనెట్లు బోధింతుననికదా? నీ అంతర్గత మథన. వాల్మీకి-కాళిదాసు-మొల్ల-వేమన-వీరంతా నీవంటి వారే! వాగ్దేవి వశవర్తినియై వారికెట్లు కావ్యామృత మిచ్చెనో, అట్లే నీ జిహ్వపై బీజాక్షరము లేర్పడి ఏక సంథాగ్రహివై నీ వొక మహా కవివై, అఖండ ప్రజ్ఞాశాలివై, నీ కీర్తి చంద్రికలు దశ దిశలకు వ్యాపించి, శోభిల్ల గలవు. మంగళకరమగు కార్యములు దేవతా జన్మగలవారికి పూర్వజన్మ సుకృతం వలన హృదయమునుండియే స్ఫురించును.

నీవు వాల్మీకి కంటే ప్రాజ్ఞుడవు కాదుగదా? దుర్మార్గుడుగా, ప్రాణి ఘాతుకుడుగా, చదువు రాని వాడుగా నుండియు శ్రీరామ మంత్ర ప్రభావముచే ఇరువది నాలుగు వేల శ్లోకములతో శ్రీమద్రామాయణమును రచించి, మహర్షిగా ప్రసిద్ధికెక్కెను. వేదముల తర్వాత మనకు లభించిన మొదటి గ్రంథ మదియే! యోగవాశిష్ఠము ముప్పది రెండువేల శ్లోకములతో వాల్మీకి రచించి, వశిష్ఠ మహర్షికి సమర్పించగా శ్రీరామునకు ఉపదేశించెను.

## పచ్చారి రచన ద్వితీయాధ్యాయం పూర్తి

# తృతీయాధ్యాయం ప్రారంభం

# రామాయణ ప్రస్తావన

అజమహారాజు తనయుడు దశరథమహారాజు. వారికి ముగ్గురు పట్టపురాణులు. వారిలో ఎవ్వరికీ సంతతి లేకపోగా, పుత్రకామేష్టి యాగము చేయగా, విష్ణు అంశతో అమృత కలశ మావిర్భవించెను. అందు అర్ధభాగము పెద్దభార్య కౌసల్యాదేవికి, అర్ధభాగము చిన్నభార్య కైకేయికి ఇచ్చిపోయినారు రాజుగారు. సుమిత్రాదేవి చూస్తూవుంటే!, వారిద్దరు సగము సగము జేసి సుమిత్రకు ఇచ్చినారు. వారు ముగ్గురు గర్భవతులై, పుత్రులను ప్రసవించినారు. కౌసల్యా సుతుడు శ్రీరాముడు, సుమిత్ర పుత్రులు లక్ష్మణ, శత్రుఘ్నులు, కైక తనయుడు భరతుడు.

## శ్రీరాముని జననము

చైత్రశుద్ధ నవమి, పునర్వసు నక్షత్రం, కటకలగ్నమున ఐదు గ్రహములు ఉచ్చయందుండగా సూర్యుడు, అంగారకుడు, శని, బృహస్పతి, శుక్రుడు తమ స్థానములైన మేష, వృషభ, మకర, తులా, కటక, మీనములందుండగా, గురువు చంద్రునితో చేరియున్న తరుణములో శ్రీరాముడు జన్మించెను. రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులుగా వశిష్ఠాది మహామునులు నామకరణము లొనర్చిరి. బాలురు దిన దిన ప్రవర్ధమానులై పెరిగి సకల విద్యలయందు ఆరితేరిన వారైయుండిరి. పదునారు వత్సరముల ప్రాయమురాగా, విశ్వామిత్రమహర్షి ఏతెంచి రామలక్ష్మణులను యాగ సంరక్షణార్థమై పంపమని కోరగా రాజునకు ఇష్టము లేకు

న్ననూ, వశిష్ఠమహర్షి సలహాపై, రాక్షస సంహరణకై పంపినారు దశరథమహారాజు.

యాగశాలకు పోయేముందు, సరయూనదిలో స్నానమాచరించి బల, అతిబల, అస్త్రశస్త్ర విద్యలను నేర్పించి, యాగశాలకు పోయి యజ్ఞ కార్యక్రమములో మౌనియుండగా, రుధిర-మాంసాలను యాగ గుండములో వేయుటకు వచ్చిన తాటకిని సంహరించి, ఆమె తనయులు మారీచ, సుబాహువులు రాగా సుబాహుణ్ణి హతమార్చి- మారీచుని ఒక్క బాణములో సముద్రములో బడునట్లు జేసి యజ్ఞశాలపైన క్రోసు దూరము వరకు అస్త్రములలో కవచమేర్పరచిరి. యజ్ఞము నిర్విఘ్నముగా జరిగెను. మిథిలానగరము పోతూ, అహల్యా శాపవిమోచన మొనర్చి, మిథిలకుపోయి శ్రీరామ లక్ష్మణుల ఆగమనము జనకునకు తెలియపరచగా, వారి ఆహ్వానము పైపోయి, వారి యింటనున్న శివధనుస్సును విరిచిన శ్రీరామునకు జానకిని యిచ్చుటకు నిశ్చయించి, అయోధ్యకు వర్తమానం పంపగా—

దశరథమహారాజు పత్నీ సమేతముగా, భరత-శత్రుఘ్నులతో, వశిష్ఠాది మహామునులతో, పురజనులతో మిథిలానగరము చేరి, రామ లక్ష్మణ విశ్వామిత్రులున్న అతిథి భవనములో నివసించి జనకునకు తెలుపగా, వారి పురోహితునితో విచ్చేసి కళ్యాణమండపమునకు తోడ్కొని వచ్చి జానకిని శ్రీరామచంద్రునకు, కుశధ్వజుని (జనకుని తమ్ముడు) తనయలు లక్ష్మణునకు ఊర్మిళను, భరత-శత్రుఘ్నులకు మాండవి-శ్రుతకీర్తులను ఇచ్చి వివాహము మహా వైభవముగా జరిపించి, ఐదు రోజుల తదుపరి నూతన దంపతులను అయోధ్యకు సాగనంపగా, దారిలో ఎదుర్కొన్న పరశురాముని గర్వమణచి, నగరము చేరిరి

## శ్రీరామ పట్టాభిషేకము

దశరథమహారాజు వయోభారముచే, రాజ్యభారము నెరవుట కష్టమని, వశిష్ఠుని అనుమతితో, శ్రీరాముని పట్టాభిషిక్తుని చేయుటకు నిశ్చయించిరి.

మందర ప్రోత్సాహములో, ఎప్పుడో యిచ్చిన రెండు వరాలు గుర్తుచేస్తూ, కైకేయి రాముని వనవాసమునకు పంపి నా కుమారుడు భరతుని పట్టాభిషేక మొనర్చుమని కోరగా, రాజు దుఃఖాక్రాంతుడై అచ్చటనే పడిపోయినాడు.

రామచంద్రునకు ముహూర్త మాసన్నమౌతుందని మంత్రులుచెప్ప, రాజును చూచుటకు కైకేయి మందిరమునకు రాగా, మూర్ఛితుడైయున్న తండ్రి దీనస్థితిని చూచి "ఏమిటి తల్లీ! తండ్రి స్పృహతప్పుటకు కారణ" మనుచు కైకనడుగ, "నిన్ను వనవాసము పంపి, భరతుని రాజ్యాభిషేక మొనర్చుమని కోరగా, నీకెట్లు చెప్పుదునా యని ఇట్లు పడిపోయినాడు. నీవు రాజవస్త్రాలన్నీ తీసి ఇచట బెట్టి అదిగో అచటయున్న నార వస్త్రములు ధరించి, వనవాసమునకు బయలుదేరుము" అని కైకేయి ఆజ్ఞాపించగా, అట్లే బయలు దేరిపోవుటకు నిశ్చయించుకున్న రామచంద్రుని అనుసరించిరి జానకీ లక్ష్మణులు.

సమస్తాభరణములతో రాజలాంఛనాలతో పట్టాభిషిక్తుడగుచున్న రాజపుత్రుడు వల్కలములను ధరించి, వనవాసము పోవుచున్నప్పుడు కూడా ఒక్క విధముగా, ముఖరాగ మొప్పుచున్న రాఘవుని గాంచి ప్రజలు విభ్రాంతులైరి. శ్రీరామచంద్రుడు తల్లులందరికి నమస్కరించి తండ్రినిలేపి, సాష్టాంగ వందనము లాచరించి "పోయివత్తుము తండ్రీ!" అని చెప్పగా—

దశరథమహారాజు

## డ అంత్యప్రాస

కండనీరు కనులవెంట ధారగా కారుచుండ
కారడవికి పోయివత్తుమని రాఘవుడు చెప్పుచుండ
రామా! రామా! యటంచు చూడలేకున్నను చూచుచుండ
బదులు చెప్పలేకుండ పడిపోయె దశరథుండు.

సీతా, లక్ష్మణ సమేతముగా బయలుదేరి పోయి గంగానదిని గుహుని సహాయముతో నావపైదాటి, భరద్వాజాశ్రమములో నివసించి యున్నాడు రామచంద్రుడు.

దశరథమహారాజు రామా! రామా! యని మరణించగా కోసలదేశ మేగియున్న భరత శత్రుఘ్నులను దూతల ద్వారా పిలువనంపగా వారు వెంటనే విచ్చేసి చూడగా, పట్టణము కళావిహీనమైయున్న-తల్లిమందిరానికి పోయి, తండ్రి మరణానికి కారణమేమని తెలుసుకొని, ఆవేదన పట్టలేక ఆక్రోసిస్తున్న తనయునికి తల్లి చెప్పినది.

“నీకు రాజ్యాభిషేకము చేయనెంచి-రాముని వనవాసము పంపనున్నాను వయోభారముచే రాజు మరణించినాడు. నీవు పట్టాభిషేకము చేసుకొని, సుఖజీవనము చేయుము తండ్రీ!” అని కైకేయి చెప్పగా, క్రోధోద్రిక్తుడైన—భరతుడు—

“ఎన్నడైనా నాకే రాజ్యము కావలెనని నే నన్నానటే! దుర్మార్గురాలా! అన్నను నాకన్నా మిన్నగా చూచుకొనుచున్నానని చెప్పుచున్న మాటలన్నీ, కపట నాటక మటే! గోముఖవ్యాఘ్రమా! పంతముబట్టి నా యగ్రజుని కఠిన వనములకు నెట్టి, నాకు పట్టము కట్ట తలపెట్టినావటే! పయోముఖ విషకుంభమా! ఛీ! నీ ముఖము చూడరా”దని, కరవాలము చేబూని కైకను నరకుట కుపక్రమించగా, “తల్లిని చంపుట మహాపాతక”మని వశిష్ఠ మహర్షి వారింపగా, ఉపసంహరించుకున్నాడు, భరతుడు.

కౌసల్యా-సుమిత్రాది తల్లులకు నమస్కరించి తండ్రికి ఉత్తర క్రియలొనర్చి, సీతా రామ లక్ష్మణులను పట్టణము నకు ఆహ్వానించుటకు, పురజనులతోటి. వశిష్ఠాది మహామునులతోటి గంగానది యొడ్డుకుజేరి, గుహుని అర్థించి భాగీరథినిదాటి, భరద్వాజాశ్రమములో నివసిస్తున్న రామచంద్రునికి నమస్కరించి తండ్రి మరణవార్తను తెలుపగా సీతారామలక్ష్మణులు దుఃఖించి గంగానదిలో పిండోదకములు వదలి, స్నానమాచరించి మౌనముగాయున్న అగ్రజునిగని, భరతుడు—

"అన్నా! రాజ్యము చేయుటకు రమ్మని" వేడుకున్న తమ్మునితో "అనుజా! నేను రాజ్యమునకు వచ్చిన తండ్రియాజ్ఞ తప్పినవాడనౌదును. నీవే రాజ్యము చేయుము" అని చెప్పగా "అన్నా మీరు ఆ మాటన్న నేనిప్పుడనే దర్భాసన మేర్పరచుకొని ప్రాణాయామమును బట్టి ప్రాణం బులు విడుతు. ఇది నా నిశ్చితాభిప్రాయము" అనిన భరతునితో అగస్త్య భరద్వాజ, వశిష్ఠాది మహామునులు ఇట్లు చెప్పిరి. "శ్రీరామ పాదు కలు తీసుకొనిపోయి వానికి పట్టముకట్టి, పాలింపుము" అనిన, మహ మునుల ఆజ్ఞానుసారము అనుసరించుటకు నిశ్చయించుకొని, అగ్రజునితో "అన్నా! వనవాసానంతరము మీరు రాకున్న, క్షణముమించినా జీవింప" నని చెప్పి అన్నకు వదినకు నమస్కరించి, సౌమిత్రికి చెప్పి పాదుకలను శిరముపై యుంచుకొని అగ్రజుని అనుమతితో బోయి——

## పాదుకా పట్టాభిషేకము

నందిగ్రామములో చేరి అచ్చటికే సింహాసనము తెప్పించి అందులో పాదుకలనుంచి, మునివేషధారియై, శత్రుఘ్ని సహాయముతో రామాజ్ఞతో పరిపాలన చూచుచున్నాడు మందమతితో భరతుడు.

## దండకారణ్యము

భరద్వాజాశ్రమము నుండి అత్రి మహామున్యాశ్రమములో కొన్ని దినములు నివసించి, దండకారణ్యముచేరి, గౌతమి సమీపమున పర్ణశా నిర్మించుకొని, మునుల సద్గోష్ఠితో కాలము గడుపుచున్నంత—శూర్పణ యను రాక్షసి, మోహినీ రూపముతో వచ్చి శ్రీరాముని పెండ్లియా మని కోరగా, "నాకు భార్యయున్నది. మా తమ్ముని కలుసు కొమ్ము" చెప్పగా "నీ తమ్ముడు అంగీకరించకపోతే! నీ భార్యను తినివేస్తా"న చెప్పిన చుప్పనాతి మాటలువిన్న సౌమిత్రి కోపోద్రిక్తుడై యున్న వాని కోరగా, జానకీదేవిని తింటానన్న చుప్పనాతి ముక్కు చెవులు కో పంపినాడు లక్ష్మణస్వామి.

## శూర్పణఖ

ఖరదూషణాది రాక్షసుల వద్దకు పోయి మొరపెట్టగా, వారంతపు రాముని పైకి యుద్ధమునకు వచ్చి రామ బాణముచే అందరూ హతులైరి. దశకంఠుని సభచేరి దీనస్థితిలో మొరపెట్టుకొనగా, "ఎవరమ్మా! నీకీ యపకారము చేసినవా"రని రావణుడంటే "రాముడంట, దశరథసుతుడంట" అని అమంటే "సరె! నేచూస్తా పో వాడి సంగతి". "వాడి సంగతి గావన్నా వాడి భార్య సంగతి చూడు. వాడే వస్తాడు. ఆ సుందరి అందమే అందము - ముజ్జగమ్ముల కానమా వసంతు. దాని పొందే చేయు వేనవేలు. చేతనయితే తెచ్చుకొనుము—నీకు మేలు''.

అన్నదే తడవుగా మారీచుని పిలిపించి ''నీవిప్పుడే పోయి మాయా కురంగమై బంగరుఛాయతో మిరుమిట్లు గొల్పునట్లు సీతను మోహింపజేసి రామలక్ష్మణులను బయటకు లాగుము. నేను ముని వేషముతో పోయి సీత నిటకు దెత్తును. త్వరగా బొమ్ము.''

''నే నచటకు పోతే బ్రతక''న్నాడు మారీచుడు.

''ఇచటవుంటే ఇప్పుడే బ్రతక''వన్నాడు దశకంఠుడు.

విధిలేక బయలుదేరి పోయి రామబాణాహతుడౌతూ ''హా! సీతా! హా! లక్ష్మణా!'' అని శ్రీరామ స్వరముతో పలికి స్వర్గస్తుడయినాడు మారీచుడు. శ్రీరాముడు హతుడయ్యెనని తలచి సీతాదేవి ''రాముని శవమైనా చూచిరమ్మని'' లక్ష్మణుని కోరగా—

''అమ్మా! త్రిభువనమ్ములు ఏకమై వచ్చినను శ్రీరాముని గెల్చుట సాధ్యము కాదమ్మా!'' అని ఎంతచెప్పినను వినకున్న భూజాత నిష్ఠురోక్తులు వినలేక గిరిగీచి సౌమిత్రి పోగా—

## సీతాపహరణము

కపట మాయా ముని వేషముతో సీతను నమ్మించి, మెప్పించి, గీతదాటించి, గడ్డ పెకళించి, భూజాతను గొనిపోవుచున్న దశకంఠుని జటాయువుగాంచి, లోకమాతనే అపహరించుక పోవుచున్నాడని తలంచి,

పిసిని కూల్చుట మంచిదనియెంచి బిట్టుగా ఎగసి, కాళ్ళతో ఒక్క తన్ను తన్నగా రథము తునాతునకలై క్రిందపడగా దశవదనములతో ఇరువ కరములతో నేలబడె గిజ-గిజ తన్నుకొనుచున్న రాక్షసాధము గోళ్ళతో చీరి, ముక్కుతో పొడిచి, రక్తసిక్తము చేయుట వింతగా చూచుచున్నది మాయా సీతాదేవి. ఒరనున్న ఖడ్గమును కరము గైకొని వృద్ధ పక్షిరాజు పక్షములు నరకి, నేలగూల్చి, భూజాలన మాయారథము చేకూర్చి, అందుచేర్చి లంకకు గొనిపోయెను లంకేశ్వరుడు.

## జటాయువు దహన సంస్కారము

జానకి అన్వేషణ చేయుచున్న రామానుజులకు పర్వతాకారముగా పడియున్న పక్షిరాజు "రామా! ఇటు రమ్మని" దీనముగా పేర్కొన్న జటాయువు వద్దకు బోగా, జరిగిన వృత్తాంత మంతయు చెప్పి శ్రీరామునితో ఐక్యమైపోయెను పక్షిరాజు. తండ్రికి మిత్రుడైన జటాయువునకు దహనసంస్కార విధులొనరించి, స్నానమాచరించి, శబర్యాశ్రమానికి చేరుకున్నారు రామానుజులు.

## శ బ రి

వాకిలిలోనున్న శబరి యాశ్రమానికి బోగా, మధుర ఫలముల ఆరగింపచేయించి, కరములు మొకలించి, "రామా! దశకంఠ కంఠఖండనంబు జేయబోవు ఆసన్నశ పరమానందమయుని మిమ్ము జూచిన కను వేరొకటి కనరేను" అని, శ్రీరాముని దన మానసంబున నిలుపుకొని శబరి యగ్నింబడి, యవిద్యాకాయంబును దహింపజేసి—

శ్రీరాముని కృపచేతను
జారు విమానంబు నెక్కి శబరి మహాత్మల్
చేరుప్పన పొందు పథమును
నారూఢిని పొందె నిర్మలాంతః కరణన్

ఆమె భగవదైక్యమయ్యెనని తలచి, పిండోదకము లొసఁగి - సీతాన్వేషణ చేయుచూ పంపా సరోవర ప్రాంతము చేరి "ఆ తీర వృక్షముల చిరుకొమ్మలయందు, శునకాదులు ప్రియముగా యెట్లు విహరించుచున్నవో చూడు లక్ష్మణా! నా సతితో గూడి యుండు భాగ్యము నాకు కలుగునా" యని విలపించుచున్న రాఘవునిగని-పార్వతీ సమేతుడయి గగన విహారము చేయుచున్న పరమేశ్వరుడు "ఆ వైకుంఠపురములో శేషతల్పముపై పవ్వళించి వక్షస్థలముపై శ్రీమహాలక్ష్మిని యుంచుకున్న ఆదివిష్ణువుకు, లోక సంరక్షణార్థమై యెట్టి కష్టము వచ్చెనో" యని ముక్కంటి నిమీలితనేత్రుండై కరములు ముకుళించి నమస్కరించుచున్న-యప్పరమేశ్వరునితో కాత్యాయిని యన్నది-"సర్వ లోకేశ్వరుడవు! మీరు సామాన్య మానవునకు కైమోడ్చి ప్రణామము లాచరించుట, నా మనస్సంగీకరించ లేకున్న"దన్న-పార్వతితో - పరమేశ్వరుడు, "కామాక్షి! వారు సామాన్యులు కావని తెలిసియే, నమస్కరించితిని. నీకు నమ్మికలేకున్న పరీక్షించుకొని రమ్ము. నే నిచ్చటనే నందీశ్వరునిపై యుందును."

## పార్వతి గర్వభంగము

మాయా కురంగమును తెమ్మనునప్పుడు ఏ విధముగా జానకి యున్నదో అదే రూపములో ప్రత్యక్షమైనది పరమేశ్వరి, శ్రీరాముని యెదుట. (సీతా వియోగబాధతో తపించుచున్న రాముడు తన్ను కౌగలించునేమో యనే భీతితో) నిలువగా, కనులుమూసి, హస్తములు జోడించి "ఈశ్వరార్ధ శరీరిణీ! నీ అపురూప దర్శనముచే నా మనోవాంఛ సఫలీకృతమాను మాతా!

ఓం ఇందుశేఖర పత్న్యై నమః

ఓం ఊహాతీత రూపాయై నమః

ఓం ఉపనిషత్ప్రీతి పాదితాయై నమః

ఓం ఇచ్ఛాశక్తి ప్రదాయై నమః

ఓం కామితార్థ ప్రదాయై నమః

అని ఈ పంచ నామావళి జపించుతోగానే అంతర్ధానమైపోయి నది ఆదిబ్రహ్మండిని. ''అయినదా అమ్మగారి ఆవేదన! తీరినదా దురా లోచన'' అన్నాడు విశ్వేశ్వరుడు. తలపంచినది త్రిభువనసుందరి. ''దేవి! నా అంశతో జన్మించిన ఆంజనేయునిలో లీనమై, శ్రీ రామ కార్యా ర్థినై వారి కార్యము సఫలీకృతమౌవరకు వారితోనే యుండి నీతో నాపు మాత్రముగా యుందును. ఇది నా నిశ్చితాభిప్రాయము.''

## ఈశ్వరాంశ సంభూతుడు ఆంజనేయుండు

సుగ్రీవుని పనుపున వటువేషమున వచ్చుచున్న హనుమంతుని రామచంద్రుడుగాంచి, లక్ష్మణా! ఆ వచ్చుచున్నది సాక్షాత్ పరమేశ్వర స్వరూపుడు, నవ వ్యాకరణవేత్త. వాని ముఖవర్చస్సు ఎంత తేజోమయ ముగా యున్నదో చూడుము. వానితో మన కార్యము తప్పక నెరవే రును. త్వరితగతిన్ ఏ మాత్రము పచియింపకుము-ఆంజనేయుని సహా యముతో-

## కిష్కింధ సమీపమునకు బోయి

సుగ్రీవునితో సఖ్యత జెసి, వాలిని సంహరించి, వాని రాజ్యము సుగ్రీవున కప్పగించి, సీతాన్వేషణ చేయుటకు నియమించి — 'వర్షాకాల మంతయూ అచ్చటనే యున్న గుహలో నివసించితిమి గదా! సౌమిత్రీ! శరదృతువు వచ్చిననూ రవిపుత్రుని జాడ తెలియకున్నది కదా! లక్ష్మణా!'

## త్ర, త్ర, త్ర ప్రాస

"శతపత్ర మిత్ర పుత్ర మైత్రి విచిత్రముగా యున్నది గదా! సౌమిత్రీ! కళత్ర మిత్ర పుత్ర పౌత్రాదులతో వాలి కళత్రతో అపవి త్రుడై-సచ్చరిత్ర పవిత్ర భూపుత్రి నా కళత్ర అన్వేషణ, రవిపుత్రుడు విస్మరించుట మరీ విచిత్రముగా యున్నదిగదా? సౌమిత్రీ! స్వకార్య మైన మీద మనకార్యము నెరవేర్చుటకు, సూర్యపుత్రుడు రవంతయైననూ

ప్రయత్నించక యుండుట, చేసిన మేలును మరచినవాడుగా యున్నాడు. ఏమి చేయుదును సౌమిత్రీ!''

''కిష్కింధకు నే నిప్పుడేపోయి సుగ్రీవుని పక్షకథాష్య మేమిటో తెల్సుకొని వచ్చెద సెలవిమ్ము అగ్రజా!''

"నిర్విఘ్నముగా కార్యము నిర్వర్తించుకొని రమ్ము లక్ష్మణా!" కాలాగ్ని రుద్రుడోయనంగ, ధనుర్బాణము చేబూని, ఘంకార రవంబులు ప్రయోగించ, ఆ ప్రమోత ఝుంకార నినదంబులు ప్రమోగ – ధరణి కంపితులై, కపి బలముతో ఏతెంచిన సుగ్రీవునితో – "వృషచరాధ్యాతా! స్వామి కార్యమునే మరచి, నిరాక్షేపణీయునివలె నీ సౌఖ్యమునే చూచుకొని, సీతాన్వేషణ మానియున్నావా? రమ్ము–రమ్ము. రామచంద్రుని కడకువచ్చి జవాబు చెప్పుకొమ్ము.''

అన విని దినజుడు, ఇనవంశస్వామి కడకేతెంచి, నమస్కరించి, "సైన్యాన్నంతా సేకరించియున్నాము ప్రభూ! తమ ఆజ్ఞయైనచో, ఆంజనేయ–అంగద–జాంబవంతాది మహావీరులతో పంపుటకు లక్ష – లక్షల మర్కటయోధులు సిద్ధముగా యున్నారు. సెలవిచ్చిన పంపెదను రామా!"

"సుగ్రీవా, వీరిని దక్షిణాపథానికి పంపుము."

అన విని సుగ్రీవుడు ''జనకజ జాడ తెలిసికొని మాసములోగా ఇచటికి చేరవలయును. ఇది నా యాజ్ఞ."

ప్రయాణోన్ముఖులై యున్న వారిలో, హనుమంతు స్వకార్య నిర్వహణ ప్రసిద్ధునిగా నెంచి–రామచంద్రుడు –

"వాయుజా, ఈ యంగుళీయము గొని
జానకిని గనుగొని జనకజకు నిచ్చి
వచ్చును వేగమె రాముడీ యెడకు
యుద్ధ యత్నము చేయుచున్నా డటంచు.

చెప్పుము. శుభములు చెప్పి శీఘ్రమే రమ్ము. నీకు మేలు కలుగు గాక. పోయిర"మ్మనిన సంతోషభరితుడై, అంగదాది మహావీరులతో, దక్షిణ సముద్ర తీరములో యున్న మహేంద్రాద్రి చేరి, అంబుధిని దిల కించి, శతయోజన విస్తీర్ణమైన సాగరమును లంఘించుట ఎవరి తరమౌనో! యని యోచించుచున్నంత-

## సంపాతి (జటాయువు సోదరుడు)

రెక్కలు లేని పక్షి అచ్చటికి వచ్చి "మీరెవ్వరో నాకు తెలియ కున్నది నాయనా" యని యనిన-

"మేము శ్రీరామ దూతలము" అని మొదలిడి వనవాస విశేషము లన్ని చెప్పుచూ జటాయువు మరణవార్త తెలుపగానే "వాడు నా తమ్ముడు" అని చింతించి, "నన్ను సముద్రము దరికిచేర్చి స్నానమాచ రించునట్లు చేయుడు శుచినై, దూరదృష్టితో అన్ని విషయములు విపు లీకరించెదను''- వనచరులట్లు చేసి ''మహానుభావా! మీకు రెక్కలులేని కారణమేమని యడుగగా, నేను నా తమ్ముడు జటాయువు సూర్యమండ లము వరకు ఎగురవలెనని పట్టుబట్టి పోగా మావాడు మధ్యలోనే స్పృహ తప్పి పడిపోయినాడు. అది నే నెరుగక, రవి దాపులకుపోయి, రెక్కలు దగ్ధమై మూర్ఛనొంది, ఇచ్చట పడిపోయి జంద్రముడు అనే మునిాశ్ర మములో చేరి, ప్రాయోపవేశము జేసి మృతినొందుట కుపక్రమించగా, ఆ ముని ఇచ్చగించక, త్వరలో శ్రీరామదూతలు వచ్చెదరు. వారికి జానకి జాడ వివరించగా పూర్వస్థితిలో బక్షము లొచ్చునని, శలవిచ్చి - తన తపశ్శక్తిచే దివ్యదృష్టి యొసంగినారు. భూపుత్రి జాడ చెప్ప గలను.

నూరు యోజనముల అంబుధి దాటగా లంకయున్నది. రావణు డనే రాక్షసాధముడు, జనకసుత నశోకవనములో యుంచి యున్నాడు. మీలో వాయునందనుడు మాత్రమే దాటగల ధీరుడు. వానిచే రామ కార్యము సఫలీకృతము కాగలదు" అని చెప్పగా రెక్కలు వచ్చినవి.

"శ్రీరామచంద్రునకు, మీకు జయము గలుగుగాక!" అని చెప్పిపోయెను. వారు చెప్పిన విధముగా అంగద, జాంబవంతాదుల అనుమతిలో అంజ నేయుడు మహేంద్రశైలముపై నెక్కి, హుంకరించి, ఒక్కుదుటున దాటెను కలశాంబోధిని కడునేర్పరియై.

వాయు తనూజుడు సువేలాద్రిపై నివసించి, రాత్రివేళ సూక్ష్మ రూపములో లంక ప్రవేశించబోగా, లంకిణి యెదురువచ్చి ప్రమింగివేయగా, బ్రహ్మాండరూపుడై పెరిగి దాని గర్భము చీల్చి వెలువడగా, అది యొక గంధర్వ కన్యయై "మహాత్మా! నీచే నాకు శాపవిమోచన మగునని బ్రహ్మ శలవిచ్చియున్నాడు. అట్లే జరిగినది శ్రీరామ కార్యము నిర్వి ఘ్నముగా జరుగుగాక. నీకు జయము కలుగు" అని చెప్పి గంధర్వలోకా నికి పోయినది లంకిణి.

పవన కుమారుడు సూక్ష్మరూపుడై లంక కేతెంచి
క్షితికుమారి కానక వెతుకు విధము—

## లంఖ్రాపాసా న్ప్రాస

వరరథశాలలు — వైద్యశాలలు
హరి కరిశాలలు—అంతర్ గృహములు
వీర భటులున్న—విపుల గేహములు
శూరులు వున్న—సుందర గృహములు
వీధులు, దిన్నెలు—విపణి మార్గములు
రచ్చలు రంగస్థలములు—గోపురములు
దేవాలయములు—తెలియని గొందులు
సోపానులును — దుస్తరమగు సందులు
వెదకి—వెదకి—వేసారి—తుదకు—
రావణు నగళ్ళు మొదలుగ
దేవారుల ఇండ్లు గలియదిరిగిన సీతా
దేవి కనబడమి నెమకుచు
బావని చనె నశ్యశోకవనమున కపుడున్

అశోక వనములో అయోనిజ-రాక్షస స్త్రీలు రావణుని ప్రేమించ మని చెప్పి-విఫలులై, నిద్రబోగా వృక్షముపై నున్న హనుమంతుడు దిగివచ్చి భూజాత యెదుట అంజలిబద్ధుడై నిలచిన - రాక్షసమాయగా తలచిన రాముని సతికి శ్రీరామ ముద్రిక అందివ్వగా, రఘురాముని వృత్తాంత మంతయు తెలిసికొని, తన శిరోభూషణము ఆనవాలుగా ఇచ్చి, "త్వరగా రామానుజులతో వచ్చి, కామాంధుల మదమణచి, నా చెర విడి పించి, తనతో దీసికొని పొమ్మని వేడుకున్నానని శ్రీరామచంద్రునితో చెప్పుము హనుమా!"

"అమ్మా! ఆకలిగాయున్నానమ్మా ఈ వనమందున్న ఫలములు తిని ఆకలి దీర్చుకొందు సెలవిమ్మమ్మా!"

"ఆకలి దీర్చుకొనుటకు, అనుమతి ఎందుకు? క్షుద్బాధ తీర్చుకొని వేగమే పోయిరమ్ము రామ దూతాగ్రణీ!" అన్నదే తడవుగా మధుర ఫల ములు తృప్తిగా భుజించి, సీతాదేవి ఉన్న అశోకవృక్షము దప్ప మిగతా వృక్షాలన్నీ పెకలించి సర్వనాశన మొనర్చగా ఎదుర్కొన్న పదివేల వనపాలక రక్కసులను గూల్చగా హతశేషులేగి దనుజాధిపతి కెరిగిం పగా లక్షసైన్యముతో అక్షయకుమారుడేగ, సైన్యాన్నంత వాలానికిచుట్టి, నేలకేసి కొట్టిన మట్టిగరచి చచ్చిరి. అక్షయకుమారుని పిడిగుద్దులతో పొడిచి, నెత్తురుగ్రక్కినటులజేసి హతమర్చెను. తప్పించుకున్న వారేగి, దశముఖున కెరిగింపగా "హా! సుతా అక్షయకుమారా! క్షయమైతివా" అని చింతించుచున్న తండ్రితో "నేనిప్పుడేపోయి ఆ కోతిని బంధించి తెత్తు" నని మేఘనాధుడు పోయి, బ్రహ్మాస్త్రముచే పవనుని బంధించి తేగా, కోతికి తోకే ముఖ్యము. ఆ తోకకు కోకలుచుట్టి నూనెతో తడిపి తగులబెట్టి, తరు ముడని, ఆజ్ఞాపించగా రాక్షసులట్లుచేయగా.

## లంకాదహనము

విభీషణుని గృహము విడిచిపెట్టి లంకంతా తగులబెట్టి వాలమును అంబుధిలో తడిపి, ఉత్సాహముతో వారిధిన్ దాటి, శ్రీరామచంద్రునిచేరి-

## మా అంత్యప్రాస

కంటిని జానకిన్ కనుగొంటిని రఘురామా!
నీ విచ్చిన ముద్రికను ఇచ్చి కొంటిని రఘుభీమా!
మణి మను, శిరోభూషణ మిదిగో తెచ్చితి శ్రీరామా!
మాసమునకు తమరు రాకున్న జపించ నన్నది పరంధామా!

మారుతి అందించిన సీతాభూషణాన్ని తిలకించి, కొంత చింతించి, సుగ్రీవ జాంబవంతాది కపిముఖ్యులలో సంప్రదించి సముద్రమునకు సేతువు కట్టుట మనుకొనుచుండ—

## విభీషణుడు శరణుజొచ్చుట

సీతాదేవిని శ్రీరామునకు ఒప్పజెప్పుమని దశకంఠుని ప్రార్థించిన విభీషణుని తన్ని తరిమికొట్టి పంపగా శ్రీరాముని పాదముల పైబడి శరణు వేడగా అభయమిచ్చి లంకారాజ్యపట్టాభిషేకము జరిపించి, దానవరాజ్యాధిపతివై రాజ్యమేలగలవని దీవించి, ఆశ్రయమిచ్చి నిలుపుకొనెను రామచంద్రుడు.

## సేతువు నిర్మించుట

రత్నగర్భుని ప్రార్థింపగా "రవికులసోమా! రఘురామా! సేతువు కట్టుటకు నీలుని నియమించుము. ఎంత పర్వతమునైనను నీళ్ళలో పెట్టిన తేలునేగాని అది మునుగదు. అది వాని వరప్రసాదము. రక్కైన కపులు పర్వతాలు తెత్తురు" అని సముద్రుడు చెప్పగా అట్లేయని వారధి బంధించి కపి సేనలతో నడచి సువేలాద్రికి చేరి సైన్యంబుల నక్కడ విడిది గావించి క్రమేణ లంకకు బయలుదేరిరి కపి బలంబు.

## దశకంఠుని తల్లి కైకసి

"నరులు, వానరులు తప్ప ఎవ్వరి చేతను చావకుండా వరమిమ్మని పరమేష్ఠిని కోరగా అట్లేయని వరమిచ్చెను వాచస్పతి. వారే నీ చావుకు కార

జమై యున్నాడు. ఇది నిజము. నా మాటవిని, లోక మాత, భూజాతను, రఘురామునకు అర్పించి, సుఖముగా జీవించు"మని తల్లి చెప్పినా లెక్క చేయక, రాక్షససైన్యాన్ని లంకాపురి చుట్టూ కాపుంచినాడు రావణుడు-

లంక కేతెంచిన కపిబలంబు ఆవంకజూడ రాక్షసగుంపు
వెంకటముగ కపురొత్తురంచు-కాపుంచిన రక్కసులు
మత్తుగత్రాగి-ఉన్మత్తతతో తూలుచున్న రక్కసులగని

# రి ప్రాసానుప్రాస

కపిముఖ్యులు :- దిగ్గరగా అరచిరి, పరికితె తన్నిరి
పిరిచిరి - కొరికిరి - నవిరిరి - గీచిరి
పెరికిరి - చరిచిరి - హింసించిరి
కిచ-కిచ అరిచిరి-వాకిట-నిలచిరి
ఉక్కిరిబిక్కిరి చేసిరి-ఊపిరి దీసిరి
పిడికిట బొడిచిరి-దహించిరి పేల్చిరి

రాత్రించరులు :- పరిగిరి- నీలిగిరి - నేలకొరిగిరి
మిగిలిన వారెల్చిరి విలపించిరి
వారి పీయనికి కనుపించిరి
"వేమరితె మని వినిపించిరి
తింటిమి తన్నులు తికమక పడితిమి
పిడికిట బొడిపించు కొంటిమి ప్రభో!"

అని విలపించిరి-అన విని వీరుడు విద్యుద్దేహుడు వీరావేశముతో పిడుగైన పదివేల ధీరులతో ఏతెంచెను.

పిడుగైన, విద్యుద్దేహుడు విర్రవీగుచు ఏగుచునుంటే, వీరహనుమ్మి మాతమ్ముతో వేసెనొక్క వ్రేటు వీరాంజనేయుడు. ఆ వ్రేటుతో నవరంధ్రంబులు నెత్తురుగ్రక్కుచు, నేలకొరిగె నా విద్యుద్దేహుడు-సశేష మేగిరి సభాస్థలమునకు, జరిగిన విషయము చెప్పెదమనుకొని. చేరినంతనే తెలుసుకొనిరి రావణముఖ్యులు.

"ఏరా! వెధవాయిల్లారా! తిండిరాతన్నులు దిట్టంగా! కుంటుచూ గూనొంచుక కూలబడెతిరి పొం(దామీ నెతురు ముఖములు జాపక-అంటుం డగనే వెళ్ళిపోయిరి హతశేషులు, వెంటనే ఇంటికి.

వశము దప్పె దశకంఠుని దశ వదనమ్ములు, కళలు దప్పె కపుల దలచి, అంగద రాయబారము విఫలమైనది. యుద్ధ సన్నాహానికి, ఇరు పక్షాలవారూ పూనుకున్నారు.

## రావణుని ప్రథమ యుద్ధము

పదితలల కిరీటంబులు
ఒదలగ శస్త్రాస్త్ర సమితి పొందుగ తనయి
ర్వది కరములందు దాల్చి
యుదయార్క ప్రభల వెలుగు నొక్క రథమెక్కెను.

నవక్ర పరాక్రమ వీరభటులు లెక్కకు మిక్కుటంబుగా, సమర సన్నాహమై, భేరీ, ఝాంకారంబులు, ధనుష్టాకారంబులు దిగంతంబులు ప్రతిధ్వనులీయ క్రూరరాక్షస సమూహంబులతో దశకంఠుడు యుద్ధ సన్నిద్ధుడైవచ్చుచుండ-

దేవతలదిగాంచి దివ్యరథ, దివ్యాస్త్ర శస్త్రాలితో, సంపూర్ణకవచ ముతో, కదతేరని శ్వేతాశ్వములతో దేవసారథి మాతలితో వచ్చి "రామా దానవుడు రథముపై యుద్ధముజేయ, శ్రీమహావిష్ణ్వంశమైన మీరు క్రింద యుండిపోవుట మంచిది గా"దని చెప్పి శ్రీరాముని ఒప్పించి, "మీకు జయము గలుగు గాక"యని దీవించి అనిమిషులు బోయిరి.

రావణుడు ప్రచండ వేగంబున సముద్దండ దండధరుండునుంబోలె ఖండనమండలంబున జొచ్చి కపిదండులబెండువడ జేయుచుండ-కోదండ రాముండాగ్రహించి ఒక్క బాణముతో, రక్కసుని విల్లు ఱుటుక్కున విరిచి, రథము నుగ్గుజేసి, అశ్వంబులు నేలగూల్చి సారథిని చంపి అతని దశమకుట కిరీట స్థగితమణులు ధరపడ భీతావహుడై-వానరులు నవ్వు చుండ, పాపచారియై అంతఃపురమునకుచేరి రక్కసులతో "వాడ నరులా

గాదు, వానరులూకాదు. వారితో పోరు శక్యముగాదు. మీరు పోయి నా సోదరుడు, కుంభకర్ణుని నిద్రలేపుడు. వానికి నిద్రాభంగమైనచో శ్రేయస్కరముగాదు. అయినా లేపండి వారితో పోరు ధీరుడతడు. తక్షణం లేపండి పొండు."

## కుంభకర్ణుని నిద్రా మందిరము

ఒకటిన్నర ఆమడల వెడల్పు, మూడు ఆమడల పొడవు, అంటులో నివసించియున్నారు అయ్యగారు. వాణ్ణి లేపుటకు అలవిగాక ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలతో త్రొక్కించి ఎట్టెట్టో తంటాలుపడి లేపితే, "ఎవర్రా! నన్ను లేపినది" అని అఱచిన అఱపుకు పెద్ద ఉరుము ఉఱిమి పిడుగు పడినంత శబ్దమావరించినది లంకాప్రదేశమంతా.

"లేచినాడురా! మనవాడు" అనుకున్నాడు రావణుడు.

చూచినాడు మాంసకుంభరాసులను కుంభకర్ణుడు.

ఇరువది దున్నలు, అరువది అశ్వములు, నూటాఇరువది మును జులు, వేయి వరాహములు వేర్వేరుగా ఖండించి, సువాసనల పాకము జేసి, రాసులు బోసినారు ఆ మాంసమంతయు కడుపారతిని, రెండు వేల కుండల మద్యపానంబు జేసి, ఒక్క త్రేపు తేపి ఆవళించి, అన్న దగ్గరకు బోగా, రత్నఖచిత సింహాసనముపై గూర్చుండ నియమించి "సోదరా! రాముడనే నరుడు వానరుల బలముతో మన పట్టణము ముట్టడిచేసి యున్నాడు. నీవు దక్క వీరులెవ్వరు లేరు వారి నెదుర్కొను టకు. యుద్ధసన్నద్ధుడవై బయలుదేరుము.

అగ్రజుని ఆజ్ఞ విని ప్రళయకాలాభిల విజృంభిత మహాంభోద రంబు చందంబున ఘర్జించుచూ యుద్ధమునకు బయలుదేరె కుంభ కర్ణుడు.

"విభీషణా! ఆ పర్వతాకారుడై వచ్చు వీరుడెవ్వడు" అని శ్రీరాముడడుగగా "వాడే కుంభకర్ణుడు. రావణునకు, నాకు మధ్యముడు.

ఇతడు నశించిన రాక్షస బలము పూర్తిగా నాశనమైనట్లే. రామచంద్రా!" యని చెప్పుచుండ—

భీకరాకారుడై పట పటార్భటుల దిక్తటములు అదిరిపడ, భేరీ, తప్పెట, మృదంగరావంబులు చెవులు చిటులు వాఱ మ్రోయుచుండ రణభూమికి చేరి, కపిబలాన్నంతా భిక్షణ చేయుచుండ, వాడు మ్రింగు చుండ, పీరు బయటికి కర్ణ నాసికములగుండా వచ్చుచుండ, చిత్రాత్ చిత్రముగా చూచుచుండి సుగ్రీవుడు—

పెద్దబండ యొకటి పెకలించుకొనివచ్చి
ఎత్తివైచె దనుజు నెత్తిమీద
నదియు వాని వక్షముదాకి చూర్ణమై
రాలె నంత నలిగి రాక్షసుండు,

శూలముతో సుగ్రీవునిపై వ్రేయ మంటలు గ్రక్కుచు, వానరుల పైకురుకుచుండ—

కోదండరాముడు కోపావిష్టుండై సహస్రాస్త్రంబులు కోదండం బున నెక్కుబెట్టి వేసిన కరచరణంబులు తెగి మొండెము మీదికే వచ్చు చున్న ఇంద్రాస్త్రము సంధించి వేయ వాని యురము ఛేదించిన—పెద్ద పర్వతాకారుడై కూలిపోయె కుంభకర్ణుడు.

దిక్కుతోచని దశకంఠుడు దీనముగా యుండ—ఇంద్రజిత్తు తండ్రిని జూచి "తండ్రీ! నే నిప్పుడేపోయి ఆ నరాధ వానరాధముల మదమడంచి, వచ్చెదను. మీరేమీ చింతించవలదు" అని చెప్పి మేఘనాథుడు మేఘము లలో దాగి బాణవర్షము గురిపించి, కపి సైన్యాన్నంతా పునా పునకలు జేయుచుండగా లక్ష్మణుడు అగ్రజు అనుమతితో, ఆంజనేయుని సహా యముతో, వెళిపోయి, మేఘములలో దాగియున్నవానిలో ఘోరాతి ఘోరముగా పోరాడుచుండ, మాయా యుద్ధములో, ఆరితేరిన ఇంద్ర జిత్తు బ్రహ్మాస్త్రంచే లక్ష్మణుని మూర్ఛగావించెను.

# లక్ష్మణస్వామి మూర్ఛ

శ్రీరాముని దుఃఖ మతిశయించుచుండగా, వానర రాజవైద్యుడు, సుషేణుడు "రామచంద్రా! సౌమిత్రి మూర్ఛ నొందియున్నాడు. ఆంజ నేయుని బంపి సంజీవి దెప్పించిన నేను బ్రతికించగలను. "సూర్యోద యము కాకూడదు. వేగమే పంపుము" అని చెప్పగా రామాజ్ఞగైకొని ఆసు-మేరూలపై ఆంజనేయుడు బోయి సంజీవి కానక, ఆ పర్వతాన్నే పెకలించుకొని రాగా, సుషేణుడు వైద్యము చేయగా, సుఖ నిద్రనుండి లేచినట్లుగా మేల్కొన్నాడు సౌమిత్రి. "మారుతీ! ఈ సంజీవి పర్వ తాన్ని ఉన్నచోట నిలిపి రమ్మ"నగా అట్లే చేసి వచ్చెను అంజనీ తన యుడు.

# ఇంద్రజిత్తు మరణము

మరలా వానర సైన్యముపై శరంపరగా బాణవర్షం కురిపించు చున్న వాని ధాటికి కపిసేన నిలువలేక యున్నది. శ్రీరాముడు వానిని సంహరించుట ఎటులని యోచించుచున్న విభీషణుడు చెప్పుచున్నాడు. "రామచంద్రా! పదునాలుగు సంవత్సరాలు నిద్రాహారములు మాని యున్న సౌమిత్రితప్ప వానిని జయించుట ఎవ్వరితరమూ గాదు. నీ సోదరుని ఆంజనేయుని సహాయమిచ్చి పంపుము. సత్వరమే హతు డగును" అని విభీషణుడు చెప్పగా విన్న లక్ష్మణుడు అగ్రజుని అనుజ్ఞతో సముద్రుడు ఇచ్చిన వజ్రకవచము ధరించి, ధనుర్బాణము లను, సూర్యభగవానుడు ఇచ్చిన ఖడ్గమును చే బూని అన్నకు నమస్క రించి, హనుమంతుని ఆరోహించి, ఇరువంకల వనచరులు బారులు దీరి ఏతేర మేఘములో దాగి మాయా యుద్ధము చేయుచున్న మేఘనాథుని అంతుతేల్చుకున్నాడు. ఆంజనేయుడు ఆకాశంవరకు పెరిగి, లక్ష్మణుని వక్షము వీక్షించి వేయుచున్న అస్త్రములను సౌమిత్రి మధ్యలోనే ద్రుంచి కోపోద్రేకంబున భయంకరంబగు ఇంద్రాస్త్రంబు సంధించి, ఆకర్ణాంతం నారిసారించి వేసిన రక్షోవిభుండు నేల్గి ధరపైబడి ప్రాణవాయువు విడిచెను.

వానరులచే చావగా మిగిలిన రాత్రించరులు రావణుని కొలువుకు చేరి, అగ్రసుతుని మరణవార్త వినిపించగా, అతడెంతలో ఆక్రోశించి, అందోళన చెంది చింతించి, పట్టపురాణి మండోదరికి కుమారుని మరణ వార్త వినిపించగా, ఆమె కుమిలి-కుమిలి ఏడ్చి, మూర్ఛ నొంది, కొంత తడవుకు తెప్పరిల్లి-

"ప్రాణేశ్వరా! పుత్రులు-మిత్రులు-బంధుమిత్రులు అందరూ రాముని హతులైరి. నే నెన్నడో చెప్పియున్నాను. శ్రీరాముడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడని, సీతాదేవి శ్రీమహాలక్ష్మి యని. నీ వా రెందరో చెప్పియున్నారు. నీవు వినిపావుగాదు. ఇప్పుడికైనా నానకి శ్రీరామునకు నమస్కరించి సమర్పించుము. క్షమించును."

"సఖి! రాముడే ఆదినారాయణుడైన వానిచే హతమైన స్వర్గలోక ప్రాప్తి నెందెదను. నేనే సంహరించిన, భూలోక ప్రసిద్ధిగాంచెదను. ఇదే నా నిర్ణయము. యుద్ధమునకు బయలుదేరుచున్నాను."

## రావణుని అంతిమ యుద్ధము

మహాగ్రహంబున పుత్ర విరహ మంబుగా ప్రస్థాన భేరివేయ నాజ్ఞాపించి, సారథి కాలకేతుని రాఘవుని యెదికి బురిగొల్పి అనేక నిశిత శస్త్రసమితి సూర్యవంశ సంజాతుని పైజొనిపి, నొవ్వజేసి వానర మూకలనెల్ల శరంపరగా బాధించి, విజృంభించుచున్న రాక్షసాధముని విజృంభణ మెట్లు మాన్పుదునా! యని రాఘవుడాలోచించుచుండ, వాయునందనుడు మహాపర్వతాన్ని తెచ్చి, వాని వక్షస్థలముపై వేయ, అది చూర్ణమై పోయినది గాని వాడేమీ సృక్కలేదు.

రఘుకులతిలకుడు, రామచంద్రుడు- సర్వదేవ మయుండగు ఆదిత్యు నారాధించి, ఇనవంశమునకు జయము చేకూర్చుమని ప్రార్థించి, తేజో విరాజితుడై, సంగరోద్యమ రణధీరుండై, దేవపతి రథారూఢుడై దశకంఠుని దరికి పోనిమ్మని దేవసారథి మాతలిని ప్రోత్సహించి, పో యుద్ధముగావింప-

తలలు ద్రుంచిన మొలచు చుండె మరల
కరములు ఛేదింప వానినే కలుపుచుండె
ద్రుంచి త్రుంచి వేమరుబోవు చుంటి, ఏమితోచకుంటి
వీని నెట్లు సంహరింపనేర్తు! విక్రమవిభీషణా! విభీషణా!

"రఘురామా! నాభియందు అమృతభాండ మున్నది. అమో పైన బ్రహ్మ వరమున్నది. అది ఛేదించుట అవశ్యము. లేకున్న ములు–కరములు మొలచుచునే యుండును" అని విభీషణుడు యెప్ప చెప్పెనో–సూర్యభగవానునికి నమస్కరించి, మంత్రపూర్వకంగా బ్ర స్త్రంబు సంధించి, నాభియందున్న యమృతకలశమును ఛేది యురమున ఐంద్రాస్త్రమేయగా, మహాపర్వతంబు బోల్కి ధరపై బడి లోకకంటకుండు దశకంఠుడు.

మండోదరి విలపించి, శోకించి అంతఃపుర స్త్రీలతో, రాక్షస కళేబరము చేరి, రామచంద్రుని గాంచి– "వీనికి అగ్నిసంస్కార చేయించుటకు విభీషణుడు దప్ప మిగిలిన వారెవ్వరూ లేరు. అం సంస్కారము చేయుటకు వాని కాజ్ఞాపింపుము రామచంద్రా!" మండోదరి చెప్పగా అటులనే యన్న శ్రీరామునికి నమస్కరించి, ముపై నగరు జేరిరి, శోకవదనులై రాక్షసాంగనలు.

## రావణుని అగ్నిసంస్కారము

శ్రీరామాజ్ఞచే రాక్షసులచేత కాష్ఠము పేర్పించి, అనుజానికాం దెప్పించి, కాష్ఠముపై యుంచి, రాజపురోహితుల రావించి, మంత్రోక్త క్రమంబున నిర్వర్తించి, అగ్నిసంస్కార మొనరించి, స్నా మాచరించి, శ్రీరామచంద్రుని గాంచి, చేతులు జోడించి, నమస్కరి నవ్విభుండతనిని గౌగలించి, కరుణాకటాక్ష సుధారస మానవిమీద సౌమిత్రిన్ గనుంగొని– "లక్ష్మణా! నీవు లంకకరిగి సకల దానవ సార్వభౌమాధికారముతో లంక పట్టంబు గట్టుము. నా ప్ర తీసను."

# విభీషణ పట్టాభిషేకము

సకల తీర్థంబులు వానర వీరులచే తెప్పించి, రాజపురోహితులను రప్పించి, మనోజ్ఞమైన యాస్థాన మండపంబున రత్నఖచిత హేమ సింహాసనమున గూర్చుండ నియమించి, సమంత్రకంబుగా నభిషిక్తుని జేసెనయ్యా సురేంద్రుని, నరేంద్రానుజుడు వేడ్కతో — లంకా సామ్రాజ్యాధీశుడైన విభీషణుండును, మంగళోపకర మణిభూషణాదులను గొనుచు రాముని కడకు చనుదెంచి శ్రీరామునకు సమర్పించి నమస్కరించిన—

"దానవరాజా! నీవేగి జానకిని పేరిచే సుమంగళ స్నానంబు చేయించి, నూతన వస్త్రాభరణాదులతో, కుసుమాక్షంతలతో, త్రిజటాది పుణ్యస్త్రీలతో రథముపై దోడ్కొని రమ్ము" అని రాఘవుడు చెప్పగా— విభీషణుడు పోయి, భూజాతకు దెల్పి, ఆమె అలంకారములకు ఇష్టపడకుండ నిరాకరించుచున్న శ్రీరామాజ్ఞ వివరింపగా ఆ ప్రకారమే యొనర్చి జయముదేర వచ్చి శ్రీరామునికి నమస్కరించి తలవంచి నిలుచున్న జానకితో—

"సీతా! అరణ్యవాసమునకు నాతో వచ్చినందుకు నీ వెంట వచ్చితిని. ఇది నా ధర్మం. పర ప్రదేశమున యున్న నిన్ను నేను యుద్ధములో గెలిచి రక్షించవచ్చు. లోకులు మెచ్చరు. అవనిజవు, అయోనిజవు అన్న విషయం నీకన్నా నాకు మిన్నగా తెలుసు. లోకాపవాదము బాపుట ఆవశ్యం. నీ ఇచ్ఛ వచ్చినట్లు జేయవచ్చును" అని రామచంద్రుడనగా— భూపుత్రి విలపించినది హృదయావేదన భరింప శక్యముగాక, వారధి తెగిన వాగువలె కన్నీరు మున్నీరై ప్రవహించినది. ఆ విషాదమును చూసిన వారందరూ విలపించి, శోకించిరి. సుగ్రీవ—సుషేణ—జాంబవంతాది పెద్దలనుమతితో, శ్రీరాముని ఆమోదముతో అగ్నిప్రవేశము చేయుటకు నిశ్చయించినది అయోనిజ—జనకపుత్రి. వానరుల సహాయముతో అగ్ని రగిల్చి మంటలు రేపెను రామానుజుడు.

# అగ్ని ప్రవేశము

ధరిత్రిపుత్రి :— "నేను శ్రీరామచంద్రుని దైవముగా, ప్రాణపతిగా తలచితినేని, మరులనెప్పుడూ సోదర భావములో యెంచితినేని, సర్వసాక్షి

కుడు నన్ను రక్షించుగాక!" అని శ్రీరాముని మదిలో తలచి, అ
గుండమునకు ప్రదక్షిణము జేసి ఆ మంటలో ప్రవేశించెను లోకమా
సీతాదేవి.

ఆ విషాద సంఘటన చూడలేక వానరులు – దానవులు ఒండొ
కనులు మూసికొనిరి.

కొన్ని క్షణాలైన పిదప అమరపూజ్యుడు (అగ్నిదేవుడు) ప్ర
క్షమై భూమాతను శ్రీరాముని వద్దకు గొనిరాగా, కట్టిన బట్ట కట్టినట్ల
పెట్టిన బొట్టు పెట్టినట్లే, మలినము తొలగిన బంగారము అపరంజి
మెఱయుచున్న సీతామాతను గాంచి అచ్చటివారు ఆశ్చర్యచ
కితులయిరి.

అగ్నిదేవుడు : "రామా! భగవద్రామా! జానకీదేవి మ
సాధ్వి! ఆమెను శంకించుటకు బ్రహ్మాది దేవతలకున్నూ సాధ్యంకా
ఈమె అయోనిజ. సర్వభక్షకుడనైన నన్ను జయించి పవిత్రత నెంచి
మహా పతివ్రత. నామాట నమ్మి, ఈ సాధ్విని స్వీకరింపు" మ
శ్రీరాముని హస్తమున సీతాదేవి హస్తముంచి, వారికి నమస్కరించి అ
శ్యుడై పోయినాడు అగ్నిభట్టారకుడు.

"విభీషణా! ఈ రోజుతో పదునాలుగు వత్సరములు అర
వాసము పూర్తగుచున్నది. ఆలస్యం జేసిన భరతుడు జీవించడు. నం
గ్రామములో నా పాదుకలుంచి, జడలు ధరించి, మౌనవ్రతుడై పరిపాల
చేయుచున్నాడు. తక్షణం బయలుదేరవలయును. ప్రయాణమును
సిద్ధం చేయుము"ని శ్రీరాముడు చెప్పగా–

## పుష్పక విమానము

మణిమయ రత్నఖచితమైన పుష్పక విమానాన్ని ఆయత్తముచే
సీతారాముల ముందుంచగా వారు, సౌమిత్రి ఆసీనులు కాగా, సుగ్రీవా
వానరబలము, విభీషణాది శాంతికాముకులైన దానవబలము పూర్తిగా
ఎక్కినారు శ్రీరామ పట్టాభిషేక మహోత్సవాహ్వానాన్ని పురస్కరిం
కొని.

పులుసు వడ్డించగా చింతతొక్కులో ఇమిడియున్న చింత ఇత్తునను ఒక పిల్లకోతి ఒత్తగా అది కొంత ఎత్తుగా ఎగిరినది.

## చింత ఇత్తు

"ఇంత చింత ఇత్తు అంత ఎత్తుకెగర దానంతనాల్గింత రెగుర కుందునా!" యటంచు గవాక్షుడెగిరెనంత. "నీయంత పదింత లెగిరెద" నంచు నీలుడెగిరె ఇంకొంత. "నీలా! నీయధికారమెంత నీవెంత నీళ్ళలో చూపు నీ ప్రతాపమంతా!" యనుచు శతబలి నీలునంత రెండింత లెగిరె. "శతబలికంటే నెనంత తక్కువా" యటంచు, గంధమాదనుడు ఇంకొంత ఎత్తుకెగిరె. మైందుడెగిరి నంత మైలున్నరపైకి దధిముఖి తానంత కంటె పైకెగిరె గవయుడు కడుభీకరముగా అందరికంటె పైకెగసె సుషేణుడు సులభముగా సుతెకె, ఇంకొంత పైకి గజుడెగిరె, హనుమ డెగిరె, నయనుడెగిరె, కేసరెగిరె. వాడెగిరి వీడెగిరి వడ్డించిన వంటకాలన్ని కుంభ మధ్యముగాజేసి ఎగురుచునేయున్నయంత వానర రాజెగిరి "సుగ్రీవాజ్ఞ" అన్నంతనే ఎగిరిన వాడెగిరినట్టె, దిగినవాడు దిగినట్టే, ఆగిపోయిరంతా, ఆజ్ఞ విన్నంత.

పవన తనయునకు జానకీదేవి బహుమతిగా ఇచ్చిన ముత్యాల హారాన్ని ఒక్కొక్క ముత్యాన్ని కొరికి, చెవియొద్దయుంచగా దేనిలోను "రామా"యన్న శబ్దమే లేకున్న, పారవైచుచున్న - రామచంద్రుడది కనుగొని "జనకజా మీరు సామాన్యమైన వనచరుడుగాడు అని లజౌడను, ఘనమైన నాపచే, నాప దగ్గి గడచితిని (పవనపుత్రుడనే పెద్ద పడవచే ఆపదనే మహా సముద్రము దాటి నిన్ను తెచ్చుకున్నాను). నీవిచ్చు అమూల్యాభరణములు వానికి లెక్కగాదు" అని తారక రామ మంత్ర ముపదేశింపగా దాన్ని జపించుచూ సంతృప్తుండయ్యె మారుతి.

## మధు వనము

"రఘురామా! మా వనచరులకు మీరు పెట్టించిన పదార్థములు తృప్తినీయ జాలవు. మన మధు వనమునకు పంపమని" రవిపుత్రుడు

కోరగా శ్రీరాముడు అనుమతించగ సుగ్రీవుడు, వానరులను వనమునకు బంపగా ఇచ్చా, స్వేచ్ఛావిహంగములవలె మధు మధుర రసఫలాదులను భక్షించి, సంతోష సంభ్రమాశ్చర్యాలలో విహరించిరి, వనచరులు.

త్రిదివసంబులు పట్టణ విశేషాలను దిలకించి, అయోధ్య రాముని అనుమతిబొంది, వారి వారి నివాసములకు బయలుదేరి పోయినారు వానరులు–దానవులు.

ఆజన్మ బ్రహ్మచారి ఆంజనేయుడు అయోధ్యలో సీతా రాముల సేవించుకొనుచూ, అచ్చటనే నిలచియున్నాడు—

శ్లో॥ ఏతదాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణంనరః
సపుత్ర పౌత్ర స్సగణః ప్రత్యసం మహీయతే.

వాల్మీకి మహర్షి "ఈ రామాయణ మహత్య మింతింతని వర్ణింప దరముగాదు" ఈ మహాపురుషుని చరిత్రను చదువువారికి, వినువారికి, మాతా పితృభక్తి సోదరప్రీతి లోకమర్యాదాను వర్తనము, పుత్ర పౌత్రాభివృద్ధిగా దైవత్వము బొందగలరని, వాల్మీకి మహర్షియే వివరించియున్నారు.

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటి విస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్.॥

వాల్మీకి మహాకవి వచించిన వచనానుసారముగా, "రామాయణం లోని ఒక అక్షరం 'రాం' అని స్మరించినా, మహాపాతకములన్నీ నశించు"నట్లు వచియించియున్నారు.

"విద్యాధరా! ఎందరో మహానుభావులు శ్రీమద్రామాయణాన్ని ఎన్నో విధములుగా వేలసంఖ్యలో వ్రాసియున్నారు. అందులో ఉదాహరణగా ఒక శార్దూలావృత్తాన్ని చూడుము—

శ్లో॥ ఉచ్ఛ్రాయత్వ విజృంభ మాణదృఢ చాపోన్ముక్త భల్లీకృతాద్యచ్ఛ్రీ
నెంతయుమించి రాఘవ భుజాదర్పాద్య మున్మాక్రియ
స్వచ్ఛ్రేయః కుతుకంబునం బొదిచె విశ్వవ్యాప్తి మద్వైమలో
లచ్ఛ్రుత్వ ధ్వను దుస్సహధ్వనిత లీలా ధూత జీమూతుడై॥

కొందరు మహామహులు దప్ప, ఎందరు చదువగలరు. ఎందరు దాని భావార్థము తెలిసికొన గలరు అందరూ అంతటి పెద్ద కావ్యాలను విపులీకరించి తెలుసుకొనుట కష్టమని భావించి సంక్షిప్తముగానైనా సకల జనులు సూక్ష్మావగాహన మొనర్చు కొనగలరని, పఠనమందే యర్థ మిమిడ్చి అతి లఘు చమత్కృతులతో వివరించి యున్నారు. నీకొరకై కొంత చెప్పిన అవగాహన జేసికొన గలవు. విద్యాపరా కొందర కొరకు కాదు కావ్యాలు వ్రాసి కఠినపదాలు జొప్పించి, తికమకలు పెట్టవలసిన దినములు పోవుచున్నవి. అందరకూ అందుబాటులో నుండునట్లుగా నీవు ప్రయత్నించ గలవని నమ్ముచున్నాను."

**పచ్చారి రచన తృతీయ అధ్యాయము పూర్తి**



# 4వ అధ్యాయము ప్రారంభం

# భారతము : గీతోపదేశము

## వినుము విద్యార్థిరా !

కౌరవులు - పాండవులు ధృతరాష్ట్ర - పాండురాజుల పుత్రులు. దుర్యోధనుని దుర్బుద్ధిలో శకుని మాయాజూదములో, పాండవుల నోడించి వారి రాజ్యముపహరించి, ద్వాదశ వర్షములు వనవాసము, ఒక వత్సరము అజ్ఞాత వాసము చేయించి, అర్ధరాజ్యమిమ్మని శ్రీకృష్ణ పరమాత్మను రాయబారము పంపగా సూది మొనమోపినంత స్థలమైన ఈయనని, దుర్యోధనుడు పట్టు బట్టెను. పెద్దలు చెప్పిననూ వినలేదు. శ్రీకృష్ణ రాయబారము విఫలమవగా, పాండవులు యుద్ధమునకు సిద్ధపడి, ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున-పాండవ కౌరవసేనలు బారులుదీరి, నిలిచిరి, శంఖములు పూరించిరి, రణభేరీలు మ్రోగించబడెను. ఇక తూణీరములు నుండి, బాణములు కదలివచ్చుటయే తరువాయి-అట్టి సమయమున, పార్థుని కోరికమేర పార్థ సారథి రథమును రెండు సేనల మధ్య-నిలపగా ఎదుటి సైన్యములో నున్న గురువులను, బంధువులను చూచి, "ఈ స్వజనంబులను జంపి రాజ్యమేలుటకంటె, భిక్షాటన చేసుకొని బ్రతుకుట మేలుగదా?" యని గాండీవము జారవిడచి, రథముపై చతికిలబడి, ధర్మా ధర్మ నిర్ణయము చేయలేక శ్రీకృష్ణుని వేడుకొని, దీనముగా తన అంతర్యం చెప్పుకున్నాడు-ధనుంజయుడు—

"తాతలున్నారు, తండ్రులున్నారు, సోదరులున్నారు. మామలు-మేనమామ లున్నారు. పుత్రులు, పౌత్రులున్నారు. గురువులు-గురు పుత్రులు, స్నేహితులు, శ్రేయోభిలాషులున్నారు వీరందరిని చూచి-చూచి, చంప చేతులెల్లాడదు చెప్పుబావా!"

"పార్థా-తల్లినైనా-తండ్రినైన గురువునైన, గురు పుత్రునైన
మామనైన-మేన మామనైన-పుత్రునైన పౌత్రునైన
ఉదకు ప్రాణమిత్రునైన, నీతిలేనివాని, నిలువున
తెగగోసి చంప వలయు సంచయించరాదు."

అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన వాక్యం-పార్థునకు రుచించలేదు-అందుకే గీతాబోధ చేయవలసి వచ్చినది—

# గీతామృత బోధ

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

ఉపనిషత్తులను, గోవులనుండి, అర్జునుడను దూడను. నిమిత్తముగా చేసుకొని శ్రీకృష్ణుడను గోపాలుడు పాలుపిండి, వ్యాసమహర్షి ద్వారా, భారత మను పాత్రయందు సేకరించబడిన అమృత ధార గీతామృతము—

అర్జునునికి, జ్ఞానోపదేశము జేయుటకు కృష్ణునకు కొన్ని ఘడియల కాలము మాత్రమే దొరికినది. అదీ, యుద్ధ సమయము, సంగ్రామమునకు ఇరుపక్షముల వారూ రణప్రక్రియకు సన్నిద్ధులై వచ్చియుండిరి. అట్టి విషమపరిస్థితులలో, శ్రీకృష్ణునకు, పార్థుని కార్యోన్ముఖుని చేయవలసిన, బ్రహ్మాండమైన బాధ్యత యేర్పడినది. కూర్చొనియున్న యువ్వచ్చుడు తేమలోపల సమస్త విజ్ఞానమును బోధింపవలసి వచ్చెను. అచ్యుతుడత్తరి తనశక్తి యుక్తులన్నిటిని, లెస్సగా క్రోడీకరించి, బోధించు కార్యమున కుపక్రమించెను—

వేదాంతముల సారమంతయూ పిండి క్షణకాలములో సమస్త శాస్త్రములయొక్క సిద్ధాంతములను చక్కగా నూరిపోసెను. తత్ఫలితముగా ఆతని ఆశయము నెరవేరినది.

యుద్ధమే చేయనని భీష్మించుక కూర్చున్న యువ్వచ్చుడు-

"కరిష్యే వచనంతవ" "ఓ కృష్ణా! నీవు చెప్పినట్లు యుద్ధము చేయుదును" అని పలికించగలిగెను. (నష్టోమోహః)

"నా మోహము తీరిపోయెను" అని చెప్పెను.

"శిష్యస్తేఽహంశాధి మాం త్వాం ప్రపన్నమ్" "నేను నీకు శిష్యుడను. నిన్ను శరణు పొందియున్నాను. కర్తవ్యం బోధించి నన్ను కాపాడుము" అని వేడుకున్నాడు. అచ్యుతునితో అర్జునుడు "పార్థా! నే చెప్పిన విధముగా వీరందరినీ సంహరింపుము."

"జీవహింస మహాపాతకముకదా? బావా!" అన్నాడు పార్థుడు.

"అర్జునా! నేచెప్పినట్లు వినవయ్యా! జీవునకు హింసలేదు. బాధలు కలులేవు. పాపమందువా! అది నీకంటదు. వారందరూ నాచే సంహరించబడియున్నారు. దివ్యదృష్టి యొసగుచున్నాను. చూడుము" అని భగవానుడు చెప్ప- అర్జునుడు చూడ అందరూ పడియున్నారు. పరమాత్మ వచనంబులు విశ్వసించి సర్వసైన్యములో తనవంతు తుదముట్టించి తన ప్రతిభ నిలుపుకున్నాడు ధనుంజయుడు.

సంజయుడు ఏనాడో చెప్పియున్నాడు ధృతరాష్ట్రునితో-

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిమ ॥

ఎచట యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడు - ధనుర్ధారియగు ధనుంజయుడు యుందురో, అచ్చట విజయము కలుగునని చెప్పియున్నాడు. నీ సుత, మీ పుత్రులు విన్నారుగాదు. పుత్ర, మిత్ర, పౌత్ర బంధు నాశ మంతా నమునిన తర్వాత, దుఃఖించి ప్రయోజనము లేదుగదా! చింత నిరమించుము ధృతరాష్ట్రుని కోరుకున్నాడు సంజయుడు.

ధర్మరాజు రాజ్యము నేలుటకు అంగీకరించలేదు

"నెత్తురుకూడు తినలేను మాధవా!" అని శ్రీకృష్ణునితో మొర పెట్టుకున్నాడు అంపశయ్యపైయున్న భీష్మాచార్యులవారు పిలిపించు

కొన్ని కొన్ని రాజధర్మములు బోధించి రాజుతో రాజ్యం అనాథ అవుతుందని తాతగారు చెప్పగా, ధర్మరాజు అంగీకరించి, ప్రజలను సుఖశాంతులతో పరిపాలించెను.

[గీతలోని శ్లోకముల సంఖ్య 70. శ్రీకృష్ణపరమాత్మ ఆ కొద్ది కాలములో వివరణ యిచ్చి యున్న అవగాహన శక్తి అర్జునకున్న తీవ్ర చిత్తైకాగ్రత నిష్ఠాయనిత అఖండ జ్ఞానోపదేశమును అవగాహన చేసుకొని యుండవచ్చును. వ్యాసభగవానుడు దాన్ని విపులీకరించి, ఛందోబద్ధముగా రచించి విశ్వవిఖ్యాతిగావించెను.

## శ్రీకృష్ణుని అవతారము

ఉపాధి వయస్సు 125 సంవత్సరముల 7 నెలల 8 రోజుల 30 ఘడియలు. గీత బోధించునప్పటికి వయస్సు 87 సంవత్సరములు. ద్వాపరయుగమున గీత బోధించబడెను. కలియుగపూర్వం 38 సంవత్సరములు.

కలి ప్రవేశముతో శ్రీకృష్ణభగవానుని అవతారము సమాప్తమైనది.
(వయస్సు సేకరణ :- గీతామకరందము)

## గీతా బోధ సమాప్తం

—o—

# భాగవతము చెప్పుచున్నాను వినుము విద్యాధరా!

అసురులు-సురులు కశ్యప ప్రజాపతి తనయులు. దితి-అదితి దక్ష ప్రజాపతి బిడ్డలు. అక్కాచెల్లెండ్రకు ఒక్కడే తండ్రియై జన్మించినవారు దేవతలు- రాక్షసులుగా పేరుపొంది, జన్మాంతర వైరముతో పోరు పోరాటాలతో, యుద్ధాలు జరుపుకొనేవారు.

నారదమహర్షి సలహాతో, క్షీరసాగరము మథించి లభించునట్టి ఫలితములను సమానముగా స్వీకరించుటకు ఆమోదము తెలుపుకున్నారు. గిరులలో పేరొందిన మందర పర్వతాన్ని కవ్వముగా యుంచుటకు ఒప్పించుకున్నారు. కద్రువ తనయుడు వాసుకి కవ్వపు త్రాడుగా యుండునట్లు అంగీకరించాడు. తరుచుటకు ప్రయత్నించగా పర్వతము మునిగి పోవుచున్న గమనించి-

## కూర్మావతారము

శ్రీ మహావిష్ణువు తాబేలు రూపము ధరించి, లక్ష యోజనముల వెడల్పు, కడు కఠోరమైన మూపురము గలిగి, విశ్వంబుపై పడక విశ్వంబు పైబడ్డ కదలని యట్టి కాళ్ళుగలిగి, మోయగలిగె మందర నగము మూపుపైన. మథన సమయములో దేవతలు యుక్తిగా వాసుకి తలవైపునకు పోయినారు. ఫణాగ్రమున మేముందవలెనని తోకవైపునకు బంపినారు దానవులు.

తరచగా-తరచగా వాసుకి నోటనుండి హాలాహలము అగ్ని జ్వాలలతో (విషము) వెల్వడినది అసురులవైపు. ఆ వేడికి తాళలేక రక్కసులు పర్విడి ఈశ్వరుని ప్రార్థింపగా-

శివుడు ఆ విషాన్ని తన గరళమందు నిలుపుకొని నీలకంఠుడిగా పేరుపొందినాడు.

భయముదీరిన రక్కసులు క్షీరసాగరము వద్దకు రాగా,అప్పటికే పయోరాసినుండి జన్మించిన ఆదిలక్ష్మి; సుధాకరుడు; కామధేనువు; కల్పవృక్షము; ఐరావతము; ఉచ్ఛైశ్వము; అప్సరసలు అన్నీ దేవతల వశమైనవి.ధన్వంతరి నమృత కలశహస్తుడగుచు కదలి వచ్చె కదలి సింధు "చావులేని మందు మనకు దక్కె"ననుచు కడవ నసురులు లాగికొని

సురలు హరికి మొఱలు పెట్టిరి, "సుధాపూర్ణ ఘటము పోయె" ననుచు—

## మోహినీ రూపము

అమృత కలశాన్నందుకున్న అసురులు నాపంచె నాదని పెను లాడు చున్న – శ్రీమన్నారాయణుడు మోహినీ రూపముతో, వా చూపులతో, వయ్యారపు నడకలతో, తళుక్కు మెఱుపులతో, క సైగలతో, పైట సవరింపులతో వారిని మోహింప చేసి సుధాకలశ తన చేబూని సురలను–అసురులను వేర్వేరుగా కూర్చుండ నియమి మోహాన్నంతా దైత్యుల పాల్జేసి, అమృతాన్నంతా అమరుల కందించి మాయా మోహిని అదృశ్యమైపోయినది.

సురల కమృతము సిద్ధించిన విధము దెలిసి కోపోద్రిక్తు దానవులు–రాక్షస రాజైన బలిచక్రవర్తి బలములో, నా నాయుధ సన్న ద్ధులై, దేవతలను చావమోది, అమర పురినుంచి తరిమికొట్టగా, క వులలో తెలియని తావుల తల దాచుకున్నారు దేవతలు.

అదితి, తన పుత్రులైన సురల బాధలను తలచుకొని, క ప్రజాపతికి విన్నవించుకున్నది "త్రిభువన సామ్రాజ్యాన్నేలిన దే ద్రుడు, వాని భార్యాబిడ్డలు, అమరులు అందరూ అమరపురి వి అడవుల్లో ఆకులలములుదిని, ఉన్నచోట దెలియక బ్రతుకుచున్నా వారి రక్షణకు సెలవిండు స్వామి!" అన విని– కశ్యప్రజాపతి "హరి సమర్పణముగా పండ్రెండు దినములు ఋణ్యవ్రత మాచరింపు శ్రీహరె నీ కోరిక దీర్పగల"రని చెప్పగా అట్లు చేయ– శ్రీమన్నా

వంతయూ నాచేతనే యున్నది. భాగ్యభోగ్యాలు నా కక్కరలేదు, నేనడి నవి లేవనక ఇచ్చిన చాలును."

బలిచక్రవర్తి యిచ్చుట కంగీకరించిన, కులగురువు శుక్రాచార్యుడు-

"దైత్యరాజా! ఈతడు సామాన్య విప్రుడుగాడు, శ్రీమహావిష్ణు ఇట్లవతరించి, నీకున్నదంతయూ హరించిపోవుటకు వచ్చియున్నాడు. మాత్రం దానమీయవద్దు. అంతాపోయి బడుగు వగిది, యెట్లు బ్రతక గలవు?"

"ఆచార్యా! నీవన్నట్లు శ్రీమన్నారాయణుడే దానగ్రహీతగా వచ్చి యున్న అంతకన్నా నా అదృష్ట మేమున్నది. శ్రీలక్ష్మీదేవి సమస్తాంగ ములపై యున్న చేయి క్రిందగుట దాతనగు నా చేయి పై నుండుట, సర్వోత్తముడైన విష్ణుమూర్తియే దానము స్వీకరించుటకు వచ్చియున్న కృషీవలునకు సుక్షేత్రము దొరికినట్లు అంతకన్నా కావలసినదేమున్నది. తప్పక ఇత్తును-అర్థ లోభంబున, నర్థిన్ బొమ్మను టెట్లు? పలికి లేదన కంటె పాపమెద్ది?"

"రాజా! వారి జాతు లందు వైవాహికము లందు
ప్రాణ విత్త మాన భంగమందు
చకిత గోకు లాగ్ర జన్మ రక్షణ యందు
బొంక వచ్చు అఘము బొంద దధిప."

"నీ ధన ప్రాణహాని కలుగుగాన, అనృత మాడినను దానవోత్తమా! అఘము బొందదయ్యా, నా మాటవిని ఇవ్వనని చెప్పుము."

"శుక్రాచార్యా! నీవంటి గురువులుండుట వల్లనే మేము రాక్షసుల మైతిమి. నీ వాక్యముల వలన అన్నిట అనృత మాడ వచ్చునని తోచు చున్నది. ఇది శుక్రనీతి యని చెప్పవచ్చును."

"దానవేంద్రా! రాక్షసవంశ నాశనమౌటకు ఆసన్నమగుచున్న నీ మనస్సు, నా మాటంగీకరించ లేకున్నది. విధి వక్రించినపుడు-అంతే జరుగును. నీ యిష్టం."

"ఆహాహా! సర్వంసహా దానమైననూ, కుల ధనమైననూ, తిరుగనేరదు నాదు జిహ్వ— ఇక మీరు చెప్పవద్దు, నేను వినలేనని అనుకోవద్దు."

"వింధ్యావళీ !" అని పిలిచినంతనే భర్త కనుసన్నెరిగి, హేమ కలశములో, నూతన జలములో చేతెంచినంతనే—

"విప్రోత్తమా! నీ పాదములను ఇటు యిమ్మా!
పసిడి పళ్ళెరములో నుంచ నిమ్మా,
జలములతో కడిగి శిరమున జల్లుకొననిమ్మా
నా జన్మ పావనమ్మని నమ్ముచున్నా! వినిపెమ్మా"

అనుచు పాదద్వయంబు గడిగి తత్పావన జలంబు శిరమున జల్లుకొని, వార్చి దేశకాల పరిగణంబు జేసి, వింధ్యావళీదేవి సువర్ణ కలశ జలము వంపుడు రంధ్రమ్మున వంపుచున్న – జలధార పడకున్న 'ఇది శుక్రుని కుయుక్త'ని తెలుసుకున్న మాయావటు డటు కుశాగ్రమున పొడుచుచున్న జలధార వేగముగా వచ్చుచున్న – కన్ను పొట్ట బోయి, ఏకనేత్రుడై తొలగి పోయె, అదృశ్యుడై దనుజాచార్యుడు.

విప్రాయ ప్రకటిత వ్రతాయ భవతే! విష్ణు స్వరూపాయ
త్రిపాద ధరణిం దాస్యామి యంచు దనుజేశ్వరుండు
బ్రహ్మ ప్రీతమ్మని దారవోసె అత్యంతోదార స్వభావుడై!

—o—

దానము స్వీకరించిన వెంటనే మాయాబ్రహ్మచారి—
పొట్టివాడు కొంచము పెరిగిన వాడై
మేఘ మండలము వరకు ఎదిగిన వాడై
చంద్ర మండలము పైకి మించిన వాడై
కాంతి మండలమైన సూర్యుని మించిన వాడై
ధ్రువ మండలమును అధిగ మించిన వాడై

సత్యలోకము వరకు పెరిగిన వాడై
బ్రహ్మాండంబు విపరి వరకు ఎదిగిన వాడై

ఒక్క పదంబు భూమియు, నొకట దివంబు ద్రొక్కి, మూ-
డవదెచట ద్రొక్క మనుచు వటున్న శిరము జూపె దైత్య చక్రవర్తి

ఆతని ఔదార్యమునకు మెచ్చి, సంకల్ప మాత్రమున వాని నా మహా భక్తాగ్రేసరుడు, ప్రహ్లాదుని రావించి, "వత్సా, ప్రహ్లాదా! నీ వాడు నీ మనుమని దౌహిత్రుని సుతలమునకు రాజు. నేను ద్వార పాలకుడ నగుచు నచట నిత్యము సర్వదా రక్షింతు" ననిన–

ప్రహ్లాదుడు హరికృపావశంబునం గృతార్థుండై, బలిదానవు పౌత్రుని గని, సంతసించి, పరమాత్మునకు నమస్కరించి, కరకమల పుట ఘటిత, నిటల తటుండై, పౌత్రుని–బలిం దౌహిత్రుని, సకలాసుర యూథంబునుం దాను నొక మహా బిలద్వారంబు జొచ్చి సుతలలోకంబునకుం జనియె భక్తశిఖామణి ప్రహ్లాదుడు.

"విద్యాధరా! పురాణేతిహాస కావ్యామృతాన్ని ఇక ఆపుదము. భాగవతములోని క్షీరసాగర మథనము కూర్మావతారము – వామనావతారము–బలిచక్రవర్తి ఔదార్యము–క్లుప్తముగా చెప్పితి. మిగిలినవన్నియు నీకు తెలియనివి కావు లోకానికి సులభశైలిలో – వివరింపుము.

"భాగవత ప్రస్తావన సమాప్తం"

"విద్యాధరా! ఈ నా చితాభస్మాన్ని అన్ని పుణ్యనదులలోను కలుపుము. ఇచట ఒక సమాధిని నిర్మించి ప్రతి ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ (ఈరోజు) కుల మత రహితముగా సహ పంక్తి భోజనము ఏర్పాటు చేయించి, ప్రతివారికి వస్త్రదానము చేయించుము. నీ సత్య తత్పరతపై నాకు నమ్మిక యున్నది. తప్పక చేయుదువు. నీవు చెప్పవలసినవన్నియు త్వరగా చెప్పుము. కొద్దికాలము మాత్రమే యున్నది.

# కఱ్ఱిబాబు శాపవిమోచన

అనన్యమైనవని యెంచిన తండ్రి శ్రీనివాసశాస్త్రి, మహేంద్రనాథ శాస్త్రి మఱ్ఱిచెట్టు వద్దకు పోయి చూచిరమ్మని విద్యాసంపన్నులైన వటువుల పెక్కాన వేతలను పంపగా, అచట కోటి సూర్యప్రకాశముగా వెలుగొందు చున్న-కనులు చెదరిపోయి తిరిగి వచ్చుచున్నంత "సూర్యాస్తసమయా ని సర్వ సన్నాహములతో యిచటికి" రమ్మని ఆకాశవాణి వివరించినట్లు వారి అంతర్గమునానికి తోసి, అప్పటి వివరణంతా శాస్త్రిగారికి, పండితు లకు చెప్పినారు

మఱ్ఱిచెట్టు వద్ద జరుగు వింతలు-విశేషాలు వింత గ్రామాల వరకు తెలిసి, ఆబాలగోపాలము వారి వారి వాయిద్యాలతో ఉరవడిగా వేచ పొంది, సకల జనోపయోగ పనులు నెరవేరుస్తున్న శాస్త్రిగారి పుత్రునకు దైవత్వ మాపాదించినట్లు తెలుసుకున్న ప్రజలు, ఆనందోత్సాహాలకు అవ ధులు లేనట్లుగా, కలయేరుల ప్రవాహములా బయలుదేరి, శ్రీనివాస శాస్త్రిగారి ఇంటి ఆవరణ చేరుకొనిరి.

మహేంద్రనాథశాస్త్రిగారు వివరించిన విధముగా రెండువందల ఎండుకొబ్బరి చిప్పలు వేసిన కాగడాలతోను, గిద్ద కర్పూరపు వెలుగుల తోను, అగరుబత్తీల సుగంధ సువాసనలతోను, సకల వాయిద్యాలతో మఱ్ఱిచెట్టు వద్దకు పోవుటకు నిశ్చయించుకొని - పంచకళ్యాణి అశ్వాన్ని అలంకరించుకొని, అశ్వరక్షకుని తీసుకవచ్చినారు.

* * *

బ్రహ్మదత్తశాస్త్రి :- "విద్యాధరా! నా ఆదేశము మేరకు యింత వరకు నీవేమి మాట్లాడలేదు. నీవు చెప్పదలచుకున్నది చెప్పుమన్నాను కదా? చెప్పుము.''

విద్యాధరుడు :- శ్రీ గురుర్బ్రహ్మా నమః శ్రీ బ్రహ్మదత్తస్వామినే నమః
నీ ప్రసాదముచే నేను ధన్యాత్ముడనైతి
సుప్రభా యుక్తమౌ, సుందరాకారముల్

విప్ర చూడామణి వేగ గైకొంటి నీ
నా ప్రకారంబుల నాకు మెలయ్యేవిన్.

ఆదారాది సదబ్జ సమన్విత, బోధరూపగుణ భూషణా!
శుద్ధ స్ఫటిక విశోభిత చిన్మయ సిద్ధయోగి హృద్గోచరా!
వ్యష్టి సమష్టి మయ ప్రపంచ ఘన సృష్టికర్త ఆరాధనా!
అస్పష్టత తొలగించియు, ననుస్పష్టత చేకూర్చిన అదృష్టా!

"ఓం జ్ఞానా జ్ఞాన గమ్యా గమ్యాయ నమః"

బ్రహ్మదత్తశాస్త్రి :- "విద్యార్థరా! సూర్యభగవానుడు ప
మాద్రి జొచ్చువేళ ఆసన్నమైనది. ఉదయాద్రిన సుధాకరుడు ఉదయ
బోవుచున్నాడు. దేవదూతలు నా కొరకై పుష్పక విమానముతో
యున్నారు" అని స్వర్గలోక విమానములో ఆసీనులై- బ్రహ్మదత్తు
దక్షిణ హస్తము సాచి "నిత్య శ్రీరస్తు, నిత్యమంగళాని భవన్తు. ఆచం
తారార్కం, భూమ్యాకాశ, వాయువ్యాగ్ని, కల్పాంతర, విద్యార్థన
ధేయస్య స్థిరం! శుభం భూయాత్' అని దీవిస్తూ, విమానములో కనిపి
పోయినారు బ్రహ్మదత్తస్వామి.

వారి ఆశీర్వాదములు పొందుచూ, శుభకరముగా హస్తము
ఊపుతూ (కట్టబాబు) విద్యార్థరుడు సాగనంపుచున్నట్లుగా యున్న
చూచువారికి.

ఊరివారందరూ తత్ప్రదేశము చేరుకున్నారు. కట్టబాబు
యున్న బాబు మేనిచ్ఛాయ అపరంజివలె దివ్యతేజ స్ఫూర్తిమన్న
బొట్టయ్యశాస్త్రి మైకం వదలి వచ్చినవారిని వింతగా చూచుచున్నారు.

విద్యార్థరునకు అందరూ తెలియుచున్నారు గాని, అతనికి తం
నయితము తెలుసుకొనుటకు సులభముగా లేదు. పితృదేవు నొద్దకేగి
సాష్టాంగ పాదాభివందన మాచరించిన, పుత్రుని ఇరుకరములచే
హృదయానికి హత్తుకొని, ఆనందబాష్పములతో ఆశీర్వదించెను. ఆ
లనే మహేంద్రనాథశాస్త్రిగారికిన్నీ నమస్కరించి, వారి అమూ

ఆశీస్సులు పొంది, పండితోత్తముల కందరికిన్నీ మ్రొక్కి వారి దీవెనలందు కొని, వచ్చిన వారందరికిన్నీ దండప్రణామము లాచరించి, వారి చేతి చెప్పరే ఆశీస్సులుగా భావించి-తండ్రిగారు శాస్త్రిగార్ల నియమానుసారం పంచకల్యాణి అశ్వాన్ని అధిరోహించి, బ్రహ్మదత్తశాస్త్రిగారిచే స్వీకరిం చిన అమూల్య రాగి మందసాన్ని ముందుంచుకొని అశ్వసేవకుడు మెల్లగా నడుపుకొని వచ్చుచుండ మహేంద్రనాథశాస్త్రిగారు చెప్పిన విధముగా-

పదునాలుగురు ముత్తైదువలు సువర్ణపళ్ళెరములక్రింద పట్టువస్త్రము లుంచుకొని, పచ్చకర్పూరపు హారతులతోను, యింకొందరు ముదితలు సుగంధద్రవ్యాల సువాసనలు వెదజల్లు అగరుబత్తీలతోను - వేదపఠన మొనర్చు వేద పండితులతోను-పదునారు జతల మంగళ వాయిద్యముల తోను, అప్సరసలను మించి; భరతనాట్య మొనర్చు దేవదాసీలతోను; జానపద నృత్యములు-కులుకు భజనలు-కోలన్న భజనలు-ఉత్సాహవంతు లైన యువకులు కఱ్ఱసాము-గరిడీ సాము-పులివేషాలు-తప్పెట్లు-తాళాల తోను; గగనభోంతరాల్ మార్మోగునట్లుగా బయలుదేరుచున్నారు. ఎండు కొబ్బరిచిప్పల కాగడాలు రెండువందలకు పైగా వరుస వరుసకు వెలుగు నిచ్చుచున్నవి. అట్టి ఉత్సవముతో బయలుదేరి, శ్రీనివాసశాస్త్రిగారి ఇంటి వాకిట అశ్వాన్ని దిగిన విద్యార్థునకు, శత నారికేళ ఫలములను దృష్టి నివారణగా వేద పండితులు కొట్ట-అక్కలందరూ కర్పూర హార తులు పట్ట- వారందరికి, మాతా మహులందించిన అమూల్యాభరణాలు సమర్పించి, నమస్కరించి-తల్లికి సాష్టాంగ దండప్రణామ మాచరించిన, పుత్రోత్సాహమునకు జనని ఆనంద పరవశురాలై - పుత్రుని కౌగలించు కొని దీవించగా-

విద్యార్థుడు శిరస్నాన మాచరించి, దుకూలాంబరములు ధరించి, గురుదత్తమగు తామ్ర మందసాన్ని దేవతార్చన గదిలో యుంచి నమస్కరించి-

ఉత్సవములో ఉత్సాహముగా వచ్చిన ప్రజలందరికి నమస్కరించి ఉచితాసనముపై యున్న పుత్రునకు పాలు, ఫలాదులు తల్లి అందివ్వగా పుచ్చుకొని విశ్రాంతిగా యుండెను విద్యాధరుడు.

వచ్చిన వేలాది ప్రజలకు షడ్రసోపేతముగా భోజన కార్యక్రమాలు జరిపించి, తృప్తిపరచిరి జననీ జనకులు. అప్పటికి అర్ధరాత్రి గడచిపోయినది. మిగిలిన రెండు యామములు వేద పఠనముతోను, భరత నాట్యాది బహుముఖ కళలలోను ఆనందపరితులైనారు ప్రజా సమూహమంతా—ఉదయభానుడు ఉదయించువరకు.

ఉషఃకాలపూర్వమే విద్యాధరునకు అభ్యంగన స్నానాదులొనరించి నూతన వస్త్రాభరణాలను ధరింపజేసి, శుభలగ్న శుభఘడియలో వేదోక్తముగా ఉపనయనము జరిపించి, యజ్ఞోపవీతం వేయించి, దేవతా పూజావిధానము, సంధ్యావందనాది కార్యక్రమాలు చెప్పగా—అవలీలగా గ్రహించి, నిత్య నైవేద్య పూజావిధులు నేర్పుగా నెరవేరుస్తున్నాడు విద్యాధరుడు.

* * *

శ్రీనివాసశాస్త్రిగారికి మేనత్త కుమారుడు మహేంద్రనాథశాస్త్రిగారు. వారికి ఇద్దరు సంతానము. పుత్రుడు విశ్వనాథుడు, పుత్రిక వసుంధర. వీరికి విద్యాభ్యాసము బాగా జరిగి, అన్ని విద్యల్లోనూ ఆరితేరినవారై యున్నారు. విద్యాధరుడు శాపవిముక్తానంతరం విజ్ఞానవంతుడై, విఖ్యాతిగాంచి యున్నాడు. విశ్వనాథుడు—విద్యాధరుడు సమ వయస్కులు. వసుంధర వీరికంటె మూడు వత్సరముల తక్కువ వయస్సు అయినా, సర్వ విద్యలలోనూ చక్కగా చదివి తండ్రి మెప్పు పొందినది. దగ్గర ఇల్లే గనుక వారు-వీరు కలసి-మెలసి యుండేవారు. విశ్వనాథ—విద్యాధరులు స్నేహానుబంధముతో మెలగుతూ, వేద, సంస్కృత శాస్త్ర విషయాలు చర్చించుకొనేవారు. వసుంధర, విద్యాధరులు ప్రేమానురాగాలతో మెలగుతూ పెద్ద లనుమతిస్తే పెండ్లి చేసుకుందా మనుకున్నారు.

* * *

వరకట్నపు పురాణంలో, వధువు జననీ జనకుల
జన్మ తరింప మని కోరిన సొట్టయ్యశాస్త్రి

విద్యాధరునకు వేలు విడిచిన మేనమామ వానికి సంతతిలేదు. చిన్నతనములో కట్టివాయిగా యున్నప్పుడు, వానికి తోడుగా – నీడగా యున్నందున – విద్యాధరునకు వివాహ ప్రస్తావనకు అనేకులు వస్తూ యుంటే– "అవంతా మా సొట్టయ్యశాస్త్రి చూస్తా"రని శ్రీనివాసశాస్త్రి చెప్పేవారు. (ఆ విషయం విద్యాధరునకు తెలియదు) అది ఆసరాగా తీసుకొని, వచ్చినవారిని అలవిగాని కోరికలు కోరి, అవల కంపేవారు. సోమశేఖర పురాగ్రహారాన్నుంచి విశ్వేశ్వరశాస్త్రి, వాని భార్య అనసూయమ్మ వచ్చి–సొట్టయ్యశాస్త్రి చేతులు పట్టుకొని "ఇవి చేతులుకావను కో"మన్నాడు" విశ్వేశ్వరశాస్త్రి.

"అయితే ఏమిటి" అన్నాడు సొట్టయ్యశాస్త్రి.

"కాళ్ళనుకో"మన్నాడు విశ్వేశ్వరశాస్త్రి.

"చేతులు పట్టుకొని కాళ్ళంటే. నే నేం ధోం చేయక్కరలేద ఒయ్యా!"

"అయ్యా తర్కశాస్త్ర నిపుణులు, మిమ్ము ఒప్పించుట మాతరం కాదు. తప్పుంటే క్షమించండి స్వామి!"

"పొగడ్తలకేమిగాని మీరు వచ్చినపనేమిటో చెప్పండి."

"స్వామి మాకు వివాహము చేయవలసిన ఏకైక పుత్రికయున్నది. సుక్షేత్రమువంటి రెండువందల యకరముల పొలమున్నది. మాది అగ్రహారము గనుక సర్కారుపన్ను చెల్లించనవసరం లేదు. పదివందల ఫలముల వెండి, అయిదువందల తులముల మేలిమి బంగారముతో, అమ్మాయిని పంపగలము మా జీవనోపాదికి కొంతభూమి యుంచుకుని మిగతా యావదాస్తి అబ్బాయిపేర ఈ రోజే వ్రాసియివ్వగలము—

"కొంత ఉంచుకుంటామనే కుంటిసాకుతోనే ఎందరో, కార్యోన్ముఖులు కాలేకపోయినారు— ఈ సంబంధం నేను ఒప్పుకోను. మీ ఇష్టం."

"అయ్యా! మీ ఇష్టప్రకారం అంతా ఇవ్వగలం."

"అయితే మీరెట్లు జీవించగలరు."

"అక్షయపాత్ర చేసుకుని జీవిస్తాము స్వామి."

"భలేవారండీ మీరు! అడుక్కుతిని బ్రతుకుతారటయ్యా, అష్టైశ్వర్యాలతో తులతూగు విద్యాధరశాస్త్రిగారి మామగారు. గతిలేక పరాన్నభుక్కులై బ్రతుకుతున్నారంటే మాకెంత తలవంపులుగా యుంటుందో చెప్పండి"?

(భార్యా భర్తలు ప్రక్కకుపోయి, ఆలోచించి) "అమ్మాయి శ్రేయస్సుకోరి, ఆత్మహత్య చేసుకుంటామండీ" అన్నారు.

"అట్లా చెప్పండి, బాగాయున్నది. అమ్మాయికి చదువు తక్కువ నలుపు ఎక్కువ, సొగసు తక్కువ, లావు ఎక్కువ-అని చెప్పారుగదా ఆస్తివుంటే అన్నీ సర్దుబాటు చేసుకుంటామురెండి" అని చెప్పి. పొట్టియ్యశాస్త్రి మాటనమ్మి, చావుకు సిద్ధపడి వాళ్లు వెళ్ళిపోయినారు

ప్రక్కఇల్లే గనుక అంతా విన్నాడు విద్యాధరుడు. "మామయ్యా!" అని అరిచాడు.

"పిలిచావా బాబూ!"

"పిలిచాను గాదు అరిచాను. నీ నెత్తినపెట్టుకొని తగుల బెట్టుకోగలి నంత ఆస్తి మనకున్నదే! ఎందుకు వారి ప్రాణాలనే తీసుకోమని కోరుచున్నావు. ఆడపిల్ల అయినంత మాత్రాన, అంత నీచముగా ప్రవర్తించవలెనా? కని పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించి, ఒకరిని నమ్మి బిడ్డనిస్తుంటే వారి సర్వస్వం గుంజుకోవటమేగాక, వారి చావుకూడా కోరవలెనా? ఇది ఏమి నీతయ్యా! మరొక్కటి-నేను వసుంధరను వివాహము చేసుకొనుటకు నిశ్చయించుకున్నాను. లదీ పెద్దలందరూ అంగీకరిస్తే! నీవు హామీ ఇచ్చిన వారికి కబురు చేయండి. వారెక్కడ ప్రాణం తీసుకుంటారో..."

తనయుడు పలికిన పలుకులు విన్న తండ్రిగారు మహేంద్రనాథ శాస్త్రిగారి ఇంటికిపోయి "బావా విద్యార్థుడు వసుంధరను వివాహము చేసుకొనుటకు నిశ్చయించుకుని యున్నాడు. మీ అంగీకారము తెలిపినచో ముహూర్తము నిశ్చయించుకొందుము" అన్నారు శ్రీనివాసశాస్త్రిగారు.

"నే నేనాడైనా, మీ మాట కాదన్నానా బావగారూ! వసుంధర తన నిశ్చితాభిప్రాయం తెలిపియున్నది. విద్యార్థుని తప్ప ఇంకొకరిని చూడ నన్నది. వైశాఖ శుద్ధ దశమి గురువారం వృషభలగ్నం నుంచి ముహూర్తం. పక్షము రోజులు ఉన్నది మీ అంగీకారమైతో అదే నిశ్చయించుకుం దుము".

"తథాస్తు" అనుకొని పురోహితుని పిలిపించి, లగ్న పత్రికలు వ్రాయించి, వియ్యంకులు ఒకరి కొకరు అందుకున్నారు.

## వివాహ మహోత్సవాహ్వాన పత్రికలు

వ్రాయించి, బంధుమిత్ర కుటుంబ సమేతముగా రావలెనని కొన్నివేల గ్రామాలకు పత్రికలు పంపినారు

## బ్రహ్మదత్త శాస్త్రిగారి అస్థికలు

విశ్వనాథునితో అశ్వములపై బయలుదేరిపోయి, సర్వ నదీ జలా లలో కలిపి దేశపర్యాటన జరిపి వివాహానికి మూడు రోజులు ముందుగానే ఇల్లు చేరుకున్నారు బావా—బావమరుదులు.

వివాహ పత్రిక అందిన ప్రతివారు ముహూర్తానికి ముందురోజే వర్ణ—వర్గ—కుల—మత— భేదములు లేక అందరూ విచ్చేసి, సొంతపనిగా చూచుకున్నారు. శతపథిగాయున్న శ్రీనివాసశాస్త్రిగారి ఇంటి పెళ్ళి మహావైభవముగా, జరిపించినారు.

# అప్పన్న దీక్షితులు

బ్రాహ్మణ శుభకార్యములలో తృప్తిగా భోంచేయగలరు. వారిని మరునటి రోజు మధ్యాహ్నపు విందుకు ఆహ్వానించగా వారొక కవిత వ్రాసి యిచ్చినారు, శాస్త్రిగారికి.

## న్న ప్రాసానుప్రాస

"(నిన్న)" అన్నము తిన్న వెనుక పరమాన్నము ఉన్నదటన్న
ఉదరము పద్దన్న నయనంబులు జింహ్మయు కావలెనన్న
నే తిన్న రాత్రి పడ్డ బాధ అంతింత కాదన్నా శ్రీనివాసన్న!
ఇక వద్దన్నా నీ విందన్నా అని నే నెంతో వేడుకున్న
"నీవు రాకున్న నే వదిలేది లేదన్న" శాస్త్రిగారి మాటనే విన్న
చిరుకోపపు మనిషని తిన్నా చారన్నము కొంచమున్న
"భుక్తాయాసముతో ఉన్నావేమిటి అప్పన్నా" అన్న
వారికి చెప్పకున్నారు అప్పన్న దీక్షితులు ఆ విధంగా జరిగి పోయెనది విందు కార్యక్రమం.

గర్భాదాన ముహూర్తము నిశ్చయించి పూల పాన్పు ఏర్పరచి—

## శోభనపు గదికి

వసుంధరను మెప్పించి ఒప్పించి, మేడపై యున్న పడక గదికి వరుసైన వదినలు, సరసులైన మరదలువులు సాగనంపగా అధునాతన మైన గవాక్షపు తలుపు గడియ దానంతటదే పడిపోయినది. ఆ గది వర్ణన చూస్తూ వస్తున్న వధువును వర్ణించుకొనుచున్నారు విద్యాధరుడు—

(మరాళగమన) హంస నడకలతో; కాలి మెట్టెల కదలికతోను; పాదగొలుసుల కమర్చిన చిరుగజ్జల ధ్వనికే, ఝల్లని మ్రోగు లయ వినా్యసాలతోను; ముంజేతి గాజుల గల గలలతోను, బంగరు వజ్రారముతో ఏతెంచు చున్న అర్ధాంగి, పుష్పరాగ నిర్మితమైన కర్ణాభరణములు; ముక్కు

నకు శోభనిచ్చు కాంచన మాణిక్యపు ముక్కెర, కంఠమున కత్యంత వెలుగునిచ్చు ముత్యాల మణిహారములు, మెరిసే జలతారు బుటాలతో స్వచ్ఛమైన తెల్ల చీర దాని కనువగు రవికతో యవ్వనపు కాంతులతో పసిమి వన్నెలో మిసమిసలాడు చున్న ఆమె మేనిఛాయ సున్నటిమెడ: గుండ్రటి భుజాలు, సన్నటి నడుము ఎత్తైన గుండె ఉద్వేగములోను ఉద్రేకములోను ఎదలో మదిలో వెలుగులు వెదజల్లుచున్న ఆమెను వర్ణించుకుంటూ పోతే ఒక్కొక్క అంగముపై ఒక్కొక్క కావ్యమే తయారౌతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే సృష్టిలోని సౌందర్యాన్నంతా ఒక్క చోటికి తెచ్చి రాసిపోసి సృష్టికర్త సృష్టించినట్లుగా యున్నది.—

## పడకగది వర్ణన చూస్తున్నది వసుంధర

ఆ గది సుందర దృశ్యాల నిధిలా యున్నది. సుందర-సుగంధ సువాసనలు వెదజల్లుచున్నవి. గది మందిరములలోను, త్రిగంధపు చెక్కలలోను, అత్యంతోన్నతంగా నిర్మించిన శిల్పచాతుర్యం, సజీవ చేవకళ ఉట్టిపడుచున్నవి. హంసతూలికా తల్పముపై పట్టుపరుపులుంచి మల్లెలు, సన్నజాజిసరాలు పందిరిమంచము పైనుంచి క్రిందికి వరుసగా దింపియున్నారు. ఆ ప్రక్కన నవ మన్మథుని బోలె కూర్చొనియున్నాడు విద్యాధరుడు

పాలు పంచదార పంచభక్ష్య పదార్థములు, గసకే, నారికేళ-ద్రాక్షాది ఫలాదులు బంగరుపళ్ళెరములో నింపి, వదలి యేతెంచె పతి యున్న పాన్పుగదికి. వచ్చి, రజిత నిర్మితమైన ముక్కాలిపీటపై సువర్ణ పళ్ళెరముంచి, అచటనే తలవంచి నిలుచున్న సతిని గాంచి, పతియు పలికె నిటుల; "వసుంధరా! రా! అటు కూర్చొనుము. అదిగో అచట శృతిజేసిన వీణ యున్నది. నీ మృదు మధుర గానములో సంగీత సాహిత్యాన్ని వినిపింపుము. నా కర్ణేంద్రియములకు ఆ యమృత గాన మాధుర్యాన్ని గ్రోలెదను" అనిన విని—

వసుంధర వీణపై స్వరాలాపన జేసెన—ఆ గానము గంధర్వ గానము లా యున్నది. సుమధుర గానాలాపన అయిపోయినా వంచిన తల యెత్తకున్న వసుంధరతో-

"సల్లక్షిత, లక్షణ, లక్షితాంగ లలితా! వసుంధరా! కజపు గట్టిన, వాత్స్యాయనుడి కామశాస్త్రాన్ని కాచి, వడపోసి, ఆమూలాగ్రం గ్రోలి, జీర్ణించుకున్న ఓ లలాంగీ! నీవా ప్రథమరాత్రి పడకగదిలో సిగ్గొనరించుట, నీవంటి కామశాస్త్రప్రవేత్తను ఈ స్థితిలో చూస్తూ యుంటే నాకే సిగ్గనిపిస్తున్నది. నాకు పాఠాలు నేర్పవగిన విశాల, విశ్రుత విశేష నేర్పరి పైన నీవా సందేహించుట-" అన, విని-

## తలయెత్తి చెప్పినది వసుంధర

"ఒక్క వాత్స్యాయనుడే గాదు. కొక్కోక శాస్త్రమెల్ల చదివి, శృంగార రసజత గలిగిన కావ్యాల లోని కామసూత్రాల నెల్ల అవలీలగా ఇంకొకరికి నేర్పగలిగిన నేర్పరిపైన మీకు నేను పాఠాలు నేర్ప గలనా? స్వామి! స్త్రీకి సిగ్గు సహజ సౌందర్యాన్నిస్తుంది. అందులో మొదటిరాత్రి-ఎంతటి విజ్ఞానవంతురాలైనా, మనస్సు ఉరవళ్ళ త్రొక్కుచున్నా, అలజడి-ఆందోళన తప్పదు. ఈ వీణాగానముతో ఆ తొట్రుపాటు పోయినది. అమృతకలశంలాంటి భవిష్యత్తుపై దృష్టి సారించి, జీవన మకరందాన్ని గ్రోలాలని, నీ నీడన వొదిగి, ముత్యపుచిప్పలో ముత్యములా ప్రశాంత వాతావరణములో జీవించ వలెనని, నిత్యం కలలుకంటున్నాను. అవి ఇప్పుడు స్వానుభవ సార్థక మౌతున్నవి."

ఆమె మనస్సెరింగిన వాడై; కేలన్ కేలూని; హంస తూలికా తల్ప పుష్ప పాన్పు పైకి చేర్చుకున్నాడు; లత వృక్షాని కల్లుకున్నట్లు పెన వైచుకొని, సృష్టి కార్యక్రమం ఆనందోత్సాహాలతో జరిపి, అలసి సొలసి నిద్రించినారు ఆ నవదంపతులు.

* * *

సూర్యోదయాత్ పూర్వమే వసుంధర పాలగ్లాసులో ప్రత్యక్షమైనది. నీ విప్పుడే స్నాన మొనర్చడం-దేవతార్చన చేయడం, సువాసనలు పరిమళించు కుసుమాలు, సు నీల, నీలకుంతలపై అలంకరించడం, కంచిపట్టు కనకాంబర జరీయుతాల చీరకట్టడం, అదే రంగు జాకెట్టు ధరించడం, పాలగ్లాసులో ప్రత్యక్ష మయినను సంతోషముగా యున్నది మరి నేనూ అరుణోదయమైనా పడకపై యుండడం - ఆశ్చర్యకరం కదూ! నే నిప్పుడే ముఖ మార్జన జేసి, సూర్య నమస్కారము లొనర్చి, పాలు తీసికొందును. మేడ దిగివచ్చి స్నానమొనర్చి దేవతార్చన పూజా కార్యక్రమాలను పూర్తిజేయుదును. నీవు పోయి పూజా సామాగ్రిని సమకూర్చుము.

* * *



# బ్రహ్మ నిష్ఠాగరిష్ఠుడై గీతాసంకల్పము:

శుభే శోభనే ముహూర్తే శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ఆగ్నేయప్రదేశే కృష్ణా కావేర్యో మధ్యప్రదేశే అస్మిన్ శోభనగృహే సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన...సంవత్సరే...అయనే...ఋతౌ...మాసే...పక్షే...తిథౌ...వాసరే... శుభనక్షత్రే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభ తిథౌ శ్రీమాన్ శ్రీమతః...గోత్రస్య...నామధేయస్య మమ ఉపాత్త దురితక్షయ ద్వారా పుణ్యఫల ప్రాప్త్యర్థం ఆత్మశుద్ధ్యర్థం భూమండలే సకల ప్రాణికోటీనాం క్షేమ సిద్ధ్యర్థం ప్రతిబంధరహిత బ్రహ్మసాక్షాత్కార జ్ఞాన సిద్ధ్యర్థం శ్రీపరమేశ్వరప్రీత్యర్థం శ్రీగీతా దేవతా ప్రీత్యర్థం ధ్యానా వాహనాది షోడశోపచార పూజా మహం కరిష్యే.

(గీతామృత సౌజన్యం)

ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా, గోవిందాయ నమః

విష్ణవే నమః - అని భగవన్నామములు స్మరిస్తూ పూజా కార్యక్రమం పూర్తిచేసి దేవతార్చన ఫలహారాదులు అందరికీ పంచి-

## గురుకులాన్ని సందర్శించి

విధి నిర్వహణలో నిమగ్నమైయున్న విద్యాధికులైన గురువులను, విద్యార్థులను ప్రోత్సహించి, వారి పాఠములను పరిశీలించి, పరీక్షు

నిర్వహించి— పంట పొలానికి తోడొక విద్యార్థిని తీసుకొనిపోతూ వానికి విజ్ఞాన విషయాలు లోకజ్ఞానం చెప్పుకొనుచూ; పొలం పోయి రావడం, విద్యా విషయాలు చర్చించుకొనడం వారికి నిత్యకృత్యాలు.

*                    *                    *

కొంత కాలానికి వసుంధర గర్భవతియై పుత్రుని గన్నది. వాని దేహచ్ఛాయ పసిడివన్నె మించియున్నది. ముఖ కళలు తేజోవంత ముగా నున్నవి. సర్వశాస్త్రకోవిదులైన పండితోత్తముల రావించి, పితామహులు–మాతామహులు–పితృదేవతలు చర్చించుకొని నామకరణ మహోత్సవము జరిపించి, 'శివహరి' అని, శివకేశవులు స్మరణకు వచ్చు నట్లు పేరుంచిరి.

బాలుడు దిన దిన ప్రవర్ధమానుడై శుక్లపక్ష చంద్రునివలె వెలు గొందుచుండెను. మాతృదేవి చిలుకపలుకులు పలుకు నాటినుండియే సంస్కృత వాక్యాలను తీర్చి దిద్ది చెప్పుచున్నది. "మాతృదేవోభవ– పితృదేవోభవ–గురుదేవోభవ" అని కంఠస్థం జేయించు చుండెను తల్లి.

శివహరి, ఉద్యానవనములో నాలుగు వత్సరముల ప్రాయములోనే ప్రాతఃకాలాన్నే తోటలోకి పర్వెత్తుకొని వచ్చి, చల్లగాలికి కదలాడే పత్రాల సందుల లోనుంచి వెలువడే ఉషఃసూర్యరేఖలను చూచేవాడు. పచ్చిగడ్డి పరకలపైని మంచు చుక్కలు సూర్యకాంతికి నిగనిగ మెరుస్తూ, మనస్సుకు గిలిగింతలు పెట్టుచుంటే, ప్రభాత వేళల పరికిస్తూ ప్రకృతి రహస్యాలకు అత్యంతానంద మొందేవాడు. తల్లి పిలుపుతో ఇల్లుచేరి స్నానపానాదు లొనర్చి, చదువు కుపక్రమించేవాడు.

**పచ్చారి రచన చతుర్థ అధ్యాయం పూర్తి**

# 5వ అధ్యాయము ప్రారంభం

# వెంకటకృష్ణుని పూర్వ వృత్తాంతం

వ్యవసాయ కూలీగా యున్న తల్లి, తండ్రి ప్రమాదవశాత్తు ఇద్దరూ మరణించగా అనాథ బాలుడుగా నున్న అబెండ్ల బాలుని చెట్టి, ఆదరించి, అందరితో చదువుకొమ్మని నియమిస్తే, వాని ధోరణి పశువుల మీదా-పొలాలమీదా కేంద్రీకృతమై, ఇంటికి వచ్చినప్పుడు అందరూ చదువునది వినుచూ అవగాహన చేసుకొనుచుండెడివాడు. 'వెంకటకృష్ణ' యని ముద్దుగా పేరు పెట్టుకొని, పుత్తపుత్రునివలె చూచుకొనువారు ఇంటి వారు.

ఆ బాలునికి పదహారు సంవత్సరముల ప్రాయము వచ్చే వరకు, కార్మికుల సహాయముతో పొలము పనులన్నీ వాడే నిగ్రహించుకొనివచ్చి, వచ్చినది మొదలు పాఠాలు శ్రద్ధగా చదువుకొనేవాడు వెంకటకృష్ణుడు

## విద్యాధరుడు

పంటచేను కేళ్ళవలసి వంట యింట యున్నయట్టి
వసుంధరను అట్టె పిలచి "కంచే కలకంఠీ వింటావటే ఒక్కమాట
వటుడట వంటరిగా యున్నవాడు, వత్సరములు వచ్చెనైదు
వసుంధరా చెప్పు చదువు పఠియించుము శాస్త్రమ్ములు
కఠిన పదముల నైనను పలికించుము వానిచేత
తేట తెల్లముగా చెప్పుచుండు యల్లప్పుడు
గంటలు ఏడయ్యెను ఎండలు మెండుగ నుండెను
ఇంటికి నే వచ్చుసరికి అంటును చేతంతా నావంటికి
కాంతా! నే వెళ్ళివస్తా పంటపొలానికి" అంటూ-

విద్యుత్ కాంతులతో కంటికి తగిలిన
ఉండవు కళ్ళని వెంటనే మూసికొంటిమి
ధర పగిలినట్లు ఉరిమెను, మరలా తీవ్రంగా మెఱిచెను
ఎట్టెట్టో తప్పుకొనుచు ఏగుదెంచి నాము ప్రభో!

గట్టు మీద యున్న యట్టి చెట్టుక్రింద చేరినాము
కాఱు మేఘమ్ములు కమ్ముచునుంటే వడగండ్ల వాన
వడిశిలతో కొట్టినట్టు కొట్టుచు నుంచె! అట్లే
ఒదిగి యుంటిమి చెట్టుకొక తట్టు; ఒకరికొకరు పట్టుకొనుచు

చెట్టుమీద పిట్టలన్ని కిలకిలమని యున్న యట్టే
ఒక్కతట్టు చేరవచ్చి, రెట్టలన్ని – మామీద పైచె
తిట్టిన ఫలమేమని అట్టులనే నిలవలేక ఎట్టో
ఆవల తట్టుకు పోగా ఆ తట్టుకు జల్లుకొట్ట
ఇంకొక తట్టుకు పోవ; ఇంకా పెద్దవాన తిప్పికొట్ట
చెట్టు చుట్టు తిరిగి తిరిగి పరిబట్టినాము సామీ!

తల తడిచెను వలు వడిచెను వలువలు వడచెను
వనితలు వడచిరి "గడ గడ" యని వనుకుచు నుండిరి
తలకు కట్టియున్న యట్టి బట్టలన్ని తడిచిపోయి
ముటికినీరు కంటిమీద వంటిమీద కారుచుండ
తుడుచుకొంటి మట్టులనే చేయునది ఏమిలేక.

జలుబులు చేసెను ఓదిరి వగ్గిరి చిడిముడి పడితిమి
నిలువగ లేమని నెలతలు చెప్పగ వింటిని
ఇంటి కేగుదమని అందరు అంటూ వుండగ
ఒంటిగ నే నుండలేక వాళ్ళెంట నే నట్టె
కుంటు కుంటూ వచ్చినాను కాళ్ళో మిళ్ళిరిగుంటే!
అప్పుడే చెప్పుదా మనుకొంటే దొరగారు ఏమంటారో! యని

# టే అంత్యప్రాస

నే 'ననుకొని చెప్పకుంటి - యేమంటే
తప్పవవ మెచ్చి ఊళ్ళు-ఊళ్ళే మునిగి పోతుంటే
..క్క కుంట కయ్యలో నిలచి పోయిన కలుపుంటే
"ముంచక పోయిన దేమిట్రా" యని తమరనుకుంటే
ట్లా యని నా మదిలో అనుకుంటే (చెప్పకుంటి)

కొన్నాళ్ళకు కలుపు తీస్తామనుకొంటే
గుంటకయ్య గనుక వెంటనే నీళ్ళెల్లకుంటే
మడవలు పూర్తిగా తీసి చూస్తూ వుంటే

పిల్లయ్యగారి మడక చేలో నీళ్ళన్ని మనకెగతన్నుతూ ఉంటే
త్రిసిన మడవలు అట్టే వేశా చేసేదేమి లేదనుకుంటూ

అట్టా ఇట్టా తంటాలుపడి నీళ్ళట్టే
కొంత పోగొట్టి కలుపు తీస్తామంటే
పరికజుడు మోపుంటుందని వనితలు రామంటే
దిగిలే తెలిసెను నే నొక్కన్నే దిగి తీస్తామంటే
కలుసు మోపిన పడాకు కణతలు తగులుతుంటే
అంతట సెలిపితి గుంటకయ్యలో యున్న కలుపుంచే

బంటునైన నేను మీకు బాధ్యుడ కాకుంటానా
మీ ఇంట తిన్నంత తింటూ చక్కగా చదుకుంటూ
అండీ-అంటనట్టుంటానా పట్టి-పట్టనట్టుంటానా స్వామీ!"

"ఒరె వెంకటకృష్ణా! నే నంటినేటో కలుపుంటే
ఎంతటి కథ నల్లితివిరా జానపద కవితా
వచనా రచనా గేయ చమత్కృతులతో"

"కథ లల్లుట కవి కట్టుట కాదు స్వామీ!
ఉన్నది ఉన్నట్టు నే కన్నది కన్నట్టు విన్నది

విన్నట్టు నే నన్నానేగాని ఒక్కటి తప్పంటే
మీ రెట్టా శిక్ష విధిస్తే నే నట్టా ఉంటా సామి!"

"అప్పా నీతో నేనెట్టా వేగేదిరా వేంకటకృష్ణా!
నా తల పట్టు చున్నట్టున్నది—కథ అల్లితి వంటే
అంతా చేర్చి; ఒనగూర్చి; జతచేర్చి; ఒకటిగా పేర్చి,
నేర్పుగా చెప్పితి వనుకుంటినే గాని, ఇంకేమీకాదు
కల్లా—బొల్లి—కల్పించి—చెప్పితి వనుకోలేను
అట్లని అనుకోకు ఇంతటిలో ఆపుదాము ఆ ప్రసంగము వినరా కృష్ణా!
నీకెట్టా అబ్బెనురా ఇంతటి ధారాశక్తైన యుక్తి
ఎవరన్నా అంటూ యుంటే నీ వింటే వచ్చెనా ఈ శక్తి
లేకుంటే, నీ స్వతహాగా వచ్చెనా ఈ యుక్తి
నీ పై కలిగెనురా నాకు పూర్తిగా అనురక్తి."

"సర్వశాస్త్ర కోవిదులైన మీ లోటి నేను వస్తూ యుండే, మీరు
చెప్పుచున్న వన్ని, నా మనఃఫలకముపై ముద్ర పడుచూ యుండే,
విద్యాలయంలో మీరు చెప్పు చున్నవన్నీ వింటూ వుండే,
శారదా నిలయమైన మీ పవిత్ర గృహములో ఉంటూ వుండే,
మాటకు మాట, పాటకు పాటా, తెలుసుకొంటిని స్వామీ!"

"నీ వంటి సులభ గ్రాహికి చెప్పవలెరా శాస్త్రమ్ములు
వెంటనే నీ కబ్బును వేంకటకృష్ణా బహు సూత్రమ్ములు.
ఇంటనే యుండి మా శివ హరితో చదుము వేదమ్ములు
బ్రాహ్మణుడు వేదము చదివిన కుతుక లుతిరింతు రను
ఉత్తర్వులు ఇక్కాలమ్మున లేవటంచు తెలిసికొనుము
ఇక నీవు బంటువు కావు మా ఇంటనే యుంటూ
విద్యార్జన చేయు ప్రధాన శిష్యగణాధిపుడనీవు వేంకటకృష్ణా!"

"అయ్యా నావొక్క మనవి వినుమయ్యా
ముంగారు బంగారు పంటలు పండే
ధాన్యలక్ష్మి నిచ్చే బంగారు పొలాన్ని

ఏవ వాలంటే మనస్సొప్పు కున్నదీ
ఇక చదు వెట్టా సాగుతుంది స్వామీ!"

"మనకు చాలు ఒక్క పంట గురుకుల
విద్యార్థులకు కూడా చాలు ఆ పంట
రెండు పంట లంటావా? పశుగ్రాసానికే నంటా,
ఈ నాచితోటి, విద్యనభ్యసించుమంటా!

రాముని నమ్మిన బంటును
భామిని నమ్మిన జనుండు పూజ్యుం డెప్పుడున్
రాముని భామిని నమ్మిన
క్షేమజ పోతన కీర్తి స్థిరమయె కృష్ణా!

భక్తిని ముక్తిని మరి గురు
భక్తిని దీక్షి యుక్తి భాగ్యాసక్తిన్
శక్తిని యిచ్చేడు చదువులు
రక్తిని నేర్వంగ వలయు రంజిల కృష్ణా!"

అంటూ చెప్పుకుంటూ ఇంటి ఆవరణము లోనికి పోయి "వెంకట కృష్ణా! నీవు పశువుల కొట్టా సరిచూచి; స్నానమాచరించి; శుచివైరా— నేను స్నాన సంధ్యానుష్ఠానము లాచరించి; దేవతార్చన కార్యక్రమాలు పూర్తి గావించి వచ్చెదను; తర్వాత, అన్నపానాదుల కుపక్రమింతుము."

మేరు సమాన ధీర వసుంధర పతి రాక కెదురుచూస్తూ కాళ్ళు కడుగు కొనుటకు కంచు చెంబుతో జలక మంచనెంచి, వంట ఇంట నున్న చెంబు కంటికి కనబడకుంటే నిట-నట-నెటు-జూచిన కానక, నట చదువు చున్న వటు నడిగెను "శివ హరీ కంచుచెంబు నెటనైనా కంటి వటరా!" అని, అనిన జనని మాటని-

"మాతా! వంట ఇంటి ప్రక్క పశ్చిమ దిశలో ఇటుకలపై యున్న యట్టి, అటకలపై యున్న"దటన్న-అటనున్న చెంబట చేగొని

జలకము కలశమున నింపి వాకిట యున్న యట్టి తిన్నెపైయుంచి; వంట ఇంటి కేతెంచెను—వెంటనే వసుంధర వంట పనులు చేయుటకై.

ఆ వెంటనే ఏతెంచెను ఇంటి యజమాని, సప్త సోపానముల పైకి. గచ్చుటరుగు పై యున్న యట్టి కంచు చెంబు చేత బట్టి ముఖమార్జనము చేసి పాదద్వయంబునకు పట్టి యున్నట్టి మట్టి నట్టె కడుగు కొనిన, జల మట్టె ఐపోగా వట్టి చెంబు అట్టె నిలుప అట్టిట్టు తట్టుకొని చెంబు అట్టె ఇక నిలచెన్—

## ను అంత్యప్రాస

వంట ఇంట యున్నయట్టి వసుంధరకు వినిపించెను!
కంచు చెంబు మ్రోత కఠినముగా అనిపించెను!
వెంటనే ఏతెంచెను కారణమేమని యోచించెను!
పతి రాక కనిపించెను కలశము పడుట కలత జెందెను!
ముఖ ద్వారము ముంగిట నిలబడి చూచుచు నుండెను!
పతి చూచెను సతి చూచుట,

## న్ అంత్యప్రాస

కంపే కలకంఠీ! జల కలశము చే కొంటిన్
ముఖ ప్రక్షాళనము చేసు కొంటిన్
పాద ద్వయంబు కడుగు కొంటిన్
జలమై పోగా, చెంబట పెట్టు చుంటిన్
పెట్టిన వెంటనే పెనుగాడ్పుల్ ఏతెంచెన్
ఆ వస్త్రముతో ముఖ శుభ్రత చేసుకొను చుంటిన్
అంతట వినిపించెన్, కంచు చెంబు గడపలపై గాలికి పడుటన్
"ఠక— ఠక— ఠక— ఠా, —ఠక — ఠక— ఠక— ఠా" యన్
సప్త సోపానములక్రింద ధబుక్కున ధరపై చతికిల బడియెన్
వింటావటే వసుంధరా! కలహకంఠివి కాకుంటే సరిపోయెన్.
అదే, కలహకంఠివైయుంటే, సతి పతుల జగడము బాపన్

సరస్వతీ పతి యైనను తీర్చ లేరను కొంటిస్
సన్నిహితులకు చెప్పుకుంటే తీరేది కాదను కొంటిస్
నీ వుంటే సరిపోయె; నా జన్మ సాఫల్యత జెందె ననుకొంటిస్

వసుంధర :– "విద్యాధర స్వామీ! ఎందుకండీ! దీనికింత కవిత పొగడ్త. మీరు నీరుపయోగించకనే కలశము ధరపై పడె ననుకొంటినే గాని; చెంబు తే మౌతుందండీ! దిట్ట మైన పుట్టి కంచు చెంబు... అయితే కానీ మీ కన్నా నా కెక్కువటండీ! – గురువరేణ్య కరుణా కటాక్ష వీక్షణా లబ్ధాష్టైశ్వర్య ధుర్యులు; ఉత్తమోత్తమ ప్రతిభావంతులు; మహా మహిమాన్వితులు; స్వకీయ సారస్వత కౌశలము ప్రదర్శించి–కావ్య కన్యల లామకు; నవ్య దుకూలాంబరములు, కాన్కగావించి; సరస జనుల మిరుమిట్లు గొలిపి, వారి మానసముల పరవశమొనరించి, ప్రాచీన మతాచారముల నెల్ల పరిశీలించి, భిన్నా–భిన్నమై చిక్కు జిక్కు గాబడిన సూత్రముల నెల్ల సంగ్రహించి– నవ్య మతాభ్యుదయమునకు దోహద మాచరించి, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని అలవరించు చున్న మహ నీయులు మీరున్న నాకు... ఈ భూలోక భోగ భాగ్యము లెందుకండీ! కంచు చెంబు కేమైతే–ఏముండీ!"

వసుంధరా! నీ తోను, మన వెంకట కృష్ణునితోనూ నిలవ జాలక వినవలసి వచ్చినది. వాడునూ ఇంతే! "కయ్యలో కలుపున్నదేమిత్రా! అంటే ముకుళితకరుడై; నిలుపు లేనట్లుగా పది పేజీల పాఠాలు ఏక ధాటిగా పఠికి: 'మీ ప్రభావమే ప్రభూ!' అంటున్నాడు! నీవూ అంతే!" అదిగో నాన్నగారు, గురుకులాన్నుంచి వెంచేయు చున్నారు. దేవతార్చన వేళ ఆసన్న మైనది. పూజకు కావలసిన సామాగ్రిని సమ కూర్చుము. నేనిప్పుడే స్నానమాచరించి త్వరగా వచ్చెదను.

మామగారి రాక కని, వెంటనే పోయినది వసుంధర. పూజా కార్యక్రమం పూర్తిజేసి–అందరూ కలసి భోంచేసినారు. విద్యాలయానికి ఏగుదెంచినాడు విద్యాధరుడు.

పితామహులైన శ్రీనివాసశాస్త్రిగారు; చిన్నికుమార్తె శ్రీలతగారు కూడ పోతూ, "వస్తావట్రా శివ హరీ! మీ చిన్నత్త వాళ్ళ ఊర్కి వస్తా"నంటే! ఎగిరి గంతేసి తాతగారి సన్నిధి చేరుకున్నాడు-"వాళ్ళ పాల కంతరాయమేర్పడుతుందేమో! నాన్నగారూ!"

"విద్యాధరా! చదువు సాగవలసిందే, నేను కాదనను. కాని, వీడు ప్రాయమునుండియే; లోకానుభవము సంపాదించుట అత్యంతావశ్యము. కూపస్థ మండూకము వలె ఇంటి కూర్చుండ నియమిస్తే; వాని మేధస్సు వికసించదు. వాడేమి నన్నూర కుండనీ! మార్గాంతము వరకు వాడి యడి ప్రశ్నలకు సమాధాన మీయవలసిందే!''

## కూపస్థ మండూకము

"తాతయ్యా! కూపస్థ మండూకమంటే బావిలోని కప్పగదా! దానితో నన్ను పోల్చినారే! ఆ సామెతకు కథ ఏమైనా యుంటే చెప్తారయ్యా!"

"సముద్రపు మండూకము మాలోకములోని జలాశయములన్నీ చూచుకొనుచూ వచ్చి ఒక బావిలోకి దిగినది; ఆ బావిలోని మండూకరాజు "ఎవరు నీవు? ఎచటి నుండి వచ్చితివి? నీ నివాసమెచ్చటిది?" అని ప్రశ్నించగా; "నేను సముద్రపు నివాసి"నని చెప్పినది అందుకి నివాసి

"మీ సముద్రము నా జానెడంత ఉంటుందా?"

"ఇంకా పెద్ద" దన్నది.

"నా దాటెడంత టుంటుందా?''

"అంతకన్నా పెద్దది.''

"ఈ బావంతుం టుందా?''

"చాలా, చాలా పెద్దది.''

కూపస్థ మండూకరాజుకు కోప మతిశయించి, "సముద్రము మన బావికంటే పెద్దదని చెప్పుచున్నది. దీన్ని సంహరించు"డని బావిలోని కప్పలన్నిటికి ఆదేశించగా; చాటంత మూపుపై-అన్నీ ఎక్కి త్రొక్కగా, ఒక్క ఊపుగా పైకెగసి విదిలించగా, అన్నీ బావిలో పడి నీల్గినవి.

వాటి మూర్ఖత్వానికి నవ్వుకుంటూ వెళ్ళిపోయినది రత్నగర్భ నివాసి (సముద్రపు మండూకము).

బావిలోని కప్పకు భూమిలోని విషయము తెలియనట్లు, ఇంటనే యున్న-ప్రపంచ పోకడ తెలియదని మన పెద్దలు ఈ విధమైన కథ సృష్టించినారు."

"భలే భలే తాతయ్యా!" అంటూ మరికొన్ని కథలు చెప్పించుకొనుచూ; శంకరాగ్రహారము నుంచి పితామహులు .. పౌత్రుడు శివశంకరి. మరరోజు సొంత వూరు చేరుకున్నారు.

## విద్యాలయములో పరీక్షలు పెట్టగా!

అన్ని శాస్త్రాలలోను ప్రథమునిగా నెగ్గిన వెంకటకృష్ణుని ఇంకొందరు విద్యార్థులను చేర్చి పరిసర గ్రామాల్లో గురుకులాలు నెలకొల్పి, విధి నిర్వహణలో వారు నిర్వహించవలసిన విధానాలు చెప్పుచున్నారు విద్యాధరుడు.

"ఇదే సుభాషితాలు-వెంకటకృష్ణా వినుము-"

## మధ్య అంత్యప్రాస

బాలల హృదయాలు వికసించా లనుకొనుము
విద్యాలయం బంగరు పంజరముగా చూడకుము
స్వేచ్ఛకావాలి విశాలదృష్టి అలవడునట్లు చేయుము
కుల-మత-వర్గ తత్వాలను ఎన్నడూ దరి రానీయకుము
సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని సమ సమాజముగా తీర్చిదిద్దుము
ప్రతి ప్రాణిలోను పరమాత్మను దర్శించి ఔన్నత్యము పొందుము

దుర్బలులకు - నిస్సహాయులకు - నిరుపేదలకు తోడ్పడుము
వైరాగ్యం పనికిరాదు, నిరాశ నిస్పృహలకు తావీయకుము
ప్రతిమాటా నీ నోట మృదు మధురంగా వచియింపుము
సుజనుల మిత్రత్వముతో సుఖజీవనము సాగింపుము
జన్మ కారకులైన జననీ జనకులను, పెద్దలను సేవింపుము
అమూల్యములైన వారి ఆశీస్సులు అనుదినము పొందుము
కళత్ర - పుత్ర - మిత్రులను పవిత్రముగా ప్రేమింపుము
వారు నీ జీవిత విశ్వాస పాత్రులని గమనింపుము
కాలాన్ని వృథా చేయకుము గతాన్ని తిరిగి తేలేము
గతజల సేతుబంధ మౌతుందని తెలిసికొనుము
ఆపదలు బాపు ఆప్తుడే ఆదినారాయణు డనుకొనుము
ధర్మాన్ని మనము రక్షిస్తే ధర్మమే మనల్ని రక్షిస్తుందనుము.

ధర్మో రక్షతి రక్షితః

స్వస్తి :- ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశః
గో బ్రాహ్మణేభ్యం శుభమస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినోభవన్తు.

## బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి
## బడుగు వర్గాల విద్యావ్యాప్తి

ప్రజాకవి : పచ్చారి వెంకటేశ్వర్లుగారి రచన

పంచమాధ్యాయం పూర్తి

# ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

'స'కార సాహిత్యాన్ని చి॥ పచ్చారి ఆనందబాబు చదవగా, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యంగారు విని వ్రాసి యిచ్చిన అమూల్యాభిప్రాయాలు-

ప్రస్తుతము ఆంగ్ల భాషామోహమున, ప్రపంచము పోవుచున్న సందర్భమున మాతృభాషలోని కుసుమాలలో చి॥ ఆనంద్ కనపరుస్తున్న తెలివితేటలకు సంతోషిస్తున్నాను. బాబు ఎన్నెన్నో భవిష్యత్తు నాకాంక్షిస్తూ ఆశీస్సులతో ... **బాలు**

వ్యస్తాక్షరి, నిషిద్ధాక్షరి, ముక్తపదగ్రస్తం, అష్టావధానం, శతావధానములో నిర్వహించేవి. కానీ, శ్రీ వెంకటేశ్వర్లు ఏకాక్షర ప్రయోగములో చేస్తున్న కృషి పైవాటికేమీ తీసిపోని ప్రక్రియ. ఇది సన్మానార్హమైన విషయం. భవిష్యత్తులో వీరు ఇంకా కొత్త ప్రయోగాలు చేయాలని ఆకాంక్ష-

ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

---

# ఆరుద్ర

భాషలో అక్షరాలెన్నున్నా ఒకే ఒక అక్షరాన్ని ఏర్పుకొని దానిలోనే కడదాకా రచన సాగించడం పూర్వంనుంచి అందరూ కూర్చుకున్న విద్యే. చిత్ర కవిత్వ రోజులు ఏనాడో పోయాయి గానీ, ఏకాక్షరములో రచన చేసేందుకు యిప్పుడు చేయగలవారుంటే ఆ రచన హృద్యంగా చేస్తే హర్షించే వాళ్ళుంటారు. లోకోభిన్నరుచి; ముఖే-ముఖే సరస్వతి శుభం - భూయాత్.

25-3-96 ఆరుద్ర

# శ్రీ ఏ. రామచంద్ర చౌదరి

ప్రొఫెసర్, మద్రాసు యూనివర్శిటీ.          ఎం.ఎ , పిహెచ్.డి.,

లోకంలో ఎందరో కవులున్నారు. ప్రాచీన కవులలో చిత్రవిచిత్ర మైన కవితా ధోరణిలో దిట్టలైన వారున్నారు. అందులో ఏకాక్షరకవితా రచన చేసిన ఒకరు. కాని ఆ వాఙ్మయ ఏకాక్షర కవితా రచన "సిద్ధి పొందింది" శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లుగారి చేతిలోనని, వారి 'న' కార సాహిత్యం చదివితే, తెలుసుకోకుండ చెప్పవచ్చు. అంతేకాదు ప్రాచీన మైన కవితలోలేని సౌలభ్యాన్ని శ్రీ వెంకటేశ్వర్లుగారు సాధించారు మేధావులైన సాహిత్యపరులకు ఈ రచన తప్పక ఆసక్తిదాయక మవుతుందని నమ్ముచున్నాను.

అక్షయ ఉగాది
10-4-86

ఏ. రామచంద్ర చౌదరి

---

# డా. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

ఒక కథను చెప్పాలి ఆ కథను అందంగా చెప్పాలి. అలా చెప్పా లనుకున్నప్పుడు అందమైన మాటలు కావాలి. ఆ మాటల కూర్పుకు అక్షరాలు కావాలి. ఎన్నో అక్షరాలైతేగాని, ఒక కథ కాదు. అది చిన్న కథ అయినా, పెద్దకథ అయినా ఈ శ్రమ తప్పదు.

ఒక అక్షరములో కథ చెప్పడం, అదీ "న" అక్షరముతో చెప్ప డము, ఇది నూతన ప్రయోగం. సృజనాత్మకమైన ప్రతిభతో కూడిన కృషి. ఇలాంటి కృషి చేసిన ప్రజాకవి పచ్చారి వెంకటేశ్వర్లుగారిని హృదయ పూర్వకముగా అభినందిస్తున్నాను.

మద్రాసు
10-3-86

డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

# "న" కారములో నవ్యసాహిత్యము

## నాంది

వంట ఇంట్లో వడలు చేయుచున్నది నాయనమ్మ. సంతా పోయి తనమెడలో యున్న బంగారు నానుతీసి, ముక్కాలు పీటపై యుంచి, వడలు చేయుటలో నిమగ్నమైయున్న సమయమును ఆదీసునుంచి వచ్చిన ఆమె పుత్రుడు, డ్రస్ మార్చుకొని, పంచకట్టుకొని వడలకై వచ్చినపుడు, తన పంచ తగిలి నూనె గిన్నెలో నాను పడిపోయినది. ప్రక్కనేయున్న ఆమె పౌత్రుడు, తన తండ్రి తల్లి వైపు చూచినాడు. తండ్రి తల్లే కదా? అని మరల నోరూరినదో ఏమో తిండే గారెలు తినవలె అన్న పరపని అనుకొని, మరలా వంట ఇంటికి పోయి రెండు వడలు తెచ్చుకొనున పుడు ముక్కాలు పీటపై యున్న తడి నాను చూచి, "ఏరా? రాం! నాయన నమ్మ ప్రక్క కూర్చొని వడలు తినుచున్నది చాలక నూనెలో నాను త్రోసినావట్రా" అని ఆఫీసు రూముకు పిలిచి దండించినాడు.

"తమరి పంచ తగిలే నూనె గిన్నెలో నాను పడింది. నాయనమ్మ—నేను చూచినాము నాన్నా,"

"నేనే నని మీ నాయనమ్మ చెప్పగలదా?" అన్నాడు తండ్రి.

"తప్పక చెప్పగలదు నాన్నా".

"వచ్చియున్నారు బంధువులు, వాజ్యాలమిచ్చుటకు వీలుగాదు. తెలిసికొను మీ నాయనమ్మను తెలివితోడ. రేపుకు యిచ్చేద గడువు, ఈరోజు వద్దు" అని తండ్రి యెప్పుడు చెప్పినాడో అది మొదలు నాయనమ్మను, తన కవితా ధోరణితో మెప్పించి, వప్పించి తండ్రికి నిజము చెప్పించి, తనపై వచ్చిన నిందను బాపుకున్నాడు మేధావి కుమారుడు రాంబాబు.

ఈ కథే "న"కార సాహిత్యానికి నాంది.

రాంబాబు = "నా నాన్న : "మా తండ్రిగారు
నన్నని : నన్ను నిందించి
నిన్నన్ననిన : నిన్ను తప్పుగా ఎన్నిన
నే విని : నేను నా చెవులతో విని,
'నూ' నని : 'ఊ'...అని
నున్నాననను : ఊరకున్నా ననను
నానీ! : జేజీ!
నా నాన్నను : నా జనకుని
నే నన్నాను : ఏమన్నానో!
విను నానీ! : విను నాయనమ్మా!
నాన్నా, నన్నన్నా : నానా నన్ను అన్నావు
నే నిన్నాను : అసత్యమైనా నేను విన్నాను–
నే నిన్నాను : నేను విన్నాను–
నా నానిననిన : నా నాయనమ్మను అంటే
నే నిననని : నేను వినసే విననని
నే ననిన : నేను, అంటే!
నాన్ని నెన్నా : ఆ మహానుభావుడు విన్నాడా!
'నో–నో'–నని : 'కాదు–కాదు' : 'లేదు–లేద'ని
నన్నెన్నన్నెనో : నన్ను ఎన్ని అన్నాడో!
నిన్నన్న న్ననెను : నిన్ను అన్ని ఇకనన్నీ అన్నాడు
నానీ! : నాయనమ్మా!
నానాన్న : మా తండ్రిగారు
నిన్నూ నన్నూ : వారి తల్లివైన నిన్నూ – పుత్రుడనైన నన్నూ
ననిన నాన్నను : అంటే – మా జనకుని–
నే నన్నా నిని నానీ : నేను ఏమన్నానో! విను, మా జనకుని, జననీ!—
నాన్నా! : ఓ జనకా!

నే నున్నాను : నీ పంచ తగిలి నూనెలో నాను[illegible]
నపుడు నే నున్నా[illegible]

నా నాని : మా నాయనమ్మ
నున్నాననెను : అచట ఉన్నానని ఆమె చెప్పెను-
నా నా(ని)నే : మా జే, జే, (మీతల్లే)
నిన్నెన్నెననిన : నీదే తప్పని చెప్పినదని నేనని-
నా నాన్నిని : అప్పుడు నాన్నగారు (మీ సుపుత్రుడు)
[illegible]

నీ నా(ని)నే : నీ నాయనమ్మ (మాతల్లి)గారే
నే నని : తన కుమారుడనైన నన్ను, నేనే నని,
నన్నెన్నిన : నన్ను తప్పుగా చెప్పిన-
"నే నినిన : "నా కర్ణేంద్రియములతో నేను వింటే!
నిన్ననను! : నిన్ను అనను.
నీ నాని నననూ"నని : నీ నాయనమ్మనూ అనను"[illegible]
నా నాన్న నిన్న : నా నాన్న నిన్నటిరోజు
నన్నెను నానీ! : నాతో అన్నాడు నాయనమ్మా!-
నన్ననా? : నూనెలో నాను తోచినది నేనంటావా?
నిన్ననా?? : నీవని నిన్నను కుంటావా?
నాన్నననా??? : లేక, నాన్నగారని వారినంటావా?
నానీ : నీవే న్యాయముగా తీర్పుచెప్పు ఓ జేజమ్మా!

నాయనమ్మ = నీ నాన్నెనని : నీ తండ్రే తప్పుచేసినాదని
నే నన్నానని : నేను చెప్పినానని,
నే నున్నాను : నీవు అచట వుండి చూచినానని చెప్పు
నా నాని నున్నానని : మా నాయనమ్మ ఉన్నానని,
నన్ నేనని : చెప్పినదని-
నీ నాన్నను : నీ తండ్రిగారేనని,
నే నన్నానని : మీ తల్లే నిన్ను అన్నదని

నీ నాన్ననను : నీ జనకునితో అనరా!
నాన్నా! : నా బుజ్జి నాయనా!

ంబాబు = నానాని : మా నాయనమ్మ
నిన్నెన్నెనని : తప్పు నీదేనని చెప్పినదని
నాన్నను : మా తండ్రిగారితో
నిన్ననే : నిన్నటి రోజే
నే నన్నాను, నానీ : నేను చెప్పినాను జేజమ్మా!
నాన్ని నేనా! : నాన్నగారు విన్నారా! వినలేదే!
నినని ననెనే! – నేను వినను పోరా! అంటాడే
నా నాన్నినునా? : ఒకవేళ నాన్న వింటాడా?
నినని ననునా? : ఇప్పుడు కూడా! విననని అనునా?
నానీ – అని, సందేహముగా ఉన్నది–జేజీ!

యనమ్మ = నీ నాన్నినని! : నీ జనకుడు వినని
నిననూ, నని : విననూ అని,
ననని– : అనని–
నీ నాన్నెనని : నీ తండ్రిగారేనని
నే నన్నానని : "
నీ నాన్నెనని : "
నే నన్నానని : నేను చెప్పినానని
నీ నాన్ననను : మీ పితామహునితో అను.
నాన్నా! : నా చిన్ని తండ్రీ!

ంబాబు = నాన్నా నాని : నాన్నగారూ! మీ తల్లి(మానాయనమ్మ)
నిన్ నన్నెను : నీవే అని అన్నది
నే నిన్నాను : నేను పలుమారులు విన్నాను–
నేను నిన్ననను : ఇకమీదట నేను నిన్ను అనను–
నన్ననను నన్ను అననని, అను, చాలు :
నాన్న–నాన్నా–నాన్నా : అంతా విన్న తండ్రిగారు

నాన్న–నాన్నా–నాన్నా – తప్పు నాదేనని తన
నాన్న–నాన్నా–నాన్నా : తల్లిగారే చెప్పగా
విని, తప్పుకొని పోతుంటే, తనయుడు
చిఱు కఱయులతో చప్పట్లు కొట్టుకుంటూ
లయ విన్యాసాలతో, నాన్న–నాన్నా–నాన్నా
అంటూ, సాగనంపినాడు, తండ్రిని రాంబాబు.

## పచ్చారి రచన : 'న'కార నవ్య సాహిత్యం సమాప్తం

---

చి॥ ఆనందబాబుచే ఆలిండియా రేడియో మద్రాస్ తెలుగు విభాగ
వారు 'న'కార సాహిత్యాన్ని చదివించి తగు పారితోషికము ఇచ్చినారు

సినీ డైరెక్టరు జంధ్యాల "ఆనందభైరవి" సినిమాలో 'మ' '
కార సాహిత్యాన్ని వినిపించి ఆబాల గోపాలాన్ని ఆనందపరు
యున్నారు.

---

# కాకోదరుడు
## నిరోష్ఠ

కాత్యాయని ఆలయాని
కనతి దూరాన నున్న
కాళయ కాగళ్ళను
కడుచిన్న వాడ యందు

కాకాణి కరుణాకరుడను
కవి యొక డుండెన్.
కరుణాకరుని సతి ఘన, శీలవతి
కళ్యాణీ, కవయిత్రియే.

కవి దంపతులకు కలిగెను
కడుగొట్టు కొడుకు, వాని
కుక్షి యన్నటికి వృద్ధి నంద యున్నన్
కాకోదరుడని అనుచుండిరి
కవులిద్దరు వానిన్
కాకోదరుడును కృతికర్తయు నయ్యెన్.

కావ్యాలను చదివిన రోజే!
కరుణాకరు డగు తండ్రికి,
కళ్యాణి యగు తల్లికి,
కాకోదరు డానాడే,
కవితలుగా వర్ణించున్!

"కళ్యాణీ నీ చిరుతనయుడు,
కాత్యాయిని వరప్రసాదుడు,

ఏకాగ్రతలో చదివి అగ్రజు గెలచెన్
ఏకసంథాగ్రహి యనవచ్చును వానిన్."

కరుణాకరు డొకరోజున
"కా,కౌ,కా,కా"యని
కాకి,కి, కూడట నేయన్,
కాకొక చేతెంచియు.

"కా,కా, కా,కా"యని
కాకుల నరవన్,
కాకులు ఏకన్‌గా ఏతెంచెను
కవళానికి నటకున్

కాకులు కూటికి రాగా,
కోకిల లటు గాంచియుండి
కూనలకై కాకుల గూటిచె చేరగ
కాకొక టటు గనుగొని.

"కా,కా, కా,కా, రా,రా" యని యరవన్,
కాకులు కోకిల లుండుట కని,
కూనలకై వచ్చిన, కోకిల లన్
కాకులు చీరన్.

కాకులు, కోకిలలు, కాట్లాడుకొనంగన్,
కోకిలలు, కాకుల కరవన్
కాకికొకటూడి, నటుచేరుండెన్.

"కాత్యాయిని గురుకులాన్నుండి"
కాకోదరు డటు రాగా,
కాకికో, కాకికో, నటునుండుటకని,
కాకోదరు డీకను "కై"గొని

కరుణాకరుడగు తండ్రిని కనుగొని
"కన్నయ్యా! ఈ యీక
కోకీకా? కాకీకా?
కనుగొను"యనియెన్.

కరుణాకరు డీకను చేకొని
కనులతో నటూ, నిటూ, కని
"కాకోదరా! ఇది,
కోకీక, కాదురా! కాకీకేరా!!"

"కొడుకా! కాకీక, కాకీక, కాక,
కోకీకగునా?
కాకీక, కాకీకే,
కోకీక కోకీకే!"

"కాకోదరా! కృతికర్తవు గదరా?
కాకీకకు కోకీకకు కల
లేమా, అంతా-ఇంతా-తెలియక,
కాకీకను, చేకొని, కను గొనుయని,
నాకడ, కేతెంచుట వింతగ లేదా?"

"కన్నయ్యా! ఈ, యీక
కాకీకో, కోకీకో
తెలియక కాదయ్యా, నేనీ
ఈకను కైకొని తెచ్చుట

అక్షర విజ్ఞానాన్నందించుట
యుక్తానని యెంచితి
చతురతగా కథగావించితి
నన్నిక, ఎన్నకు యని విన్నవించితి
అన్యథా, భావించకు జనకా?"

అని కాకోదరు దన విని
తనయుని యుక్తా యుక్తిని
కరుణాకరుడు, కళ్యాణి విని
కడు సంతోషాధిక్యతతో దీవించిరి; వానిన్

పదముల సొంపుతో, నడకల సొగసుతో నాట్యాడు తనయుడు కాకోదరునకు గురుకులాన్ని వప్పించి విశ్రాంతి తీసుకున్నారు జననీ జనకులు.

“క”కార సాహిత్య కల్పిత కథ సమాప్తం.



# ఉదయగిరి

చరిత్ర ప్రసిద్ధమైన ఉదయగిరికి ఆ పేరు ఎట్లు వచ్చెనో? అనే వారు లేక పోలేదు. అంతటి నిటారైన కొండ ఆంధ్రప్రదేశ్‌లో లేదనే చెప్పవచ్చు. సూర్యోదయపు తొలికిరణాలు ఆ శైల శిఖరాగ్రమున ప్రసరించుటవలన, ఆ నగరమునకు "ఉదయగిరి" అనే సార్థక నామ మేర్పడినట్లు కవులు వర్ణించియున్నారు.

విజయనగర వైభవోన్నత కాలమున శత్రువుల కబేధ్యమని, పెట్టనికోటని ఎంచి ఆ నగరాగ్రమున దుర్గమేర్పరచుకొని ఆ నగరమున వైందవాలయములుఅత్యున్నత స్థాయిలోఏర్పరచియున్నారు. విజయనగర పతనావస్థానంతరము మహమ్మదీయుల దండయాత్రతో కొండపైయున్న కోటను వశపరచుకొని హిందూ దేవాలయాల నన్నింటిని ధ్వంసముజేసి, అత్యున్నత శిల్పాలను పెరకి తటాకములలో పారవైచినారు.

వేసవిలో నీరింకినపుడు అత్యంత సుందరముగా మలచిన శిల్ప నైపుణ్యాలనుచూచి కళాత్మక హృదయాలు కాని కఠినాత్ములు సైతము కంటతడి పెట్టక మానరు. ఆలయ నిర్మాణములో, నిలువెత్తు శిలలపై ఆదిమూర్తుల విగ్రహాలను నిర్మించియుంటే, అవి పెకలిస్తే, ఆలయమే కూలి సైన్యమంతా సజీవ సమాధుల వౌతామని ఎంచినారో! ఏమో! అలవిగాని విగ్రహాలను ఆపాదమస్తకమువరకు ఛేదించి రూపమే లేనట్లు చేసినారు.

## -: అది ఆనాటి పరిస్థితి :-

నేటిస్థితి అందుకు భిన్నముగా యున్నది. హిందూ ముస్లిం సమైఖ్యత సహోదర సమానత్వముకు సామీప్యముగా యున్నది **డా॥ ఎం. ఏ. ఓబయ్య, M. A; B. S; M. S; G. D. S. గారి** జన్మస్థలము చరిత్ర పేరెన్నికగన్న "ఉదయగిరి". డాక్టరుగారి సహచరులు మత సామరస్యానికి మరపురాని మహనీయులు – హిందువేకాని ముస్లిమేగాని అన్యోన్యతలో అంతకు మించినవారు లేరనే చెప్పవచ్చు. ఆ విధంగా ఏర్పడిన ఐక్యత అందరిలోను ఆప్యాయతగా నిలిచిపోయినది.

తప్పు ఎవరు చేసినా, జరిగిన తప్పును నేరము చేసిన కుటుంబ పెద్దలకు తెలిపితే, వారే దండించే విధముగా యున్నది. నేటిస్థితి–

హిందువుల ఇంటి సమీపమున మహమ్మదీయులు నివసిస్తున్నారు. ఇరు కుటుంబాల మైత్రీ భావం అన్యోన్యతకు అవధులు లేనివిధముగా యున్నది. ఒకరోజు మన పాప–వాళ్ళ పాప బుజ్జి–బుజ్జి ఆటలు ఆనేటపుడు ఒక్క తొక్కుడు బిళ్ళ ఆటలో ముస్లిముల పాప గెలిస్తే మనమ్మాయి ఓర్వలేక వెక్కిరించి వచ్చినదట బాబూ!

కథానాయకుడు :– గోపినాథ్ తండ్రిలో చెప్పినగాథే, హిందూ ముస్లిం సమైఖ్యత–బ'కార సాహిత్య భావార్ధం.

## బ కార సాహిత్య భావార్ధము

### హిందూ ముస్లిం సమైఖ్యత

బాబూ మన
బాబాయిగారి పాప
బాబమ్మగారి పాపని

భో, భో అని భౌ, భౌ అని
బూబూ, అని వెక్కిరించెనట బాబూ!

బూబమ్మగారి బేబి
బూబమ్మతో అనిన
బూబమ్మ బేబీవాళ్ళ
బాబుతో అనిన

బేబీవాళ్ళ బాబు,
మన బాబమ్మతో అనిన
బాబమ్మ మన
బాబాయితో అనిన
బాబాయి మన బేబికి
రెండిచ్చెనట చాపట్లు బాబూ

అది విని మన బాబ్జిగాడు
కొట్టెను చప్పట్లు బాబూ!

అందరూ సంతోషించినారు.

"బ" కార భావార్థం సమాప్తం.



# ప్రచురణకు 'పచ్చారి' రచనలు

నెల్లూరు: ఫిబ్రవరి 6 (వెలిన్యూస్) రాజుల కాలంలో కవులను పోషించారు. ఇప్పుడు కొంతమంది కవుల ప్రతిభా పాటవాల్ని ప్రభుత్వం గుర్తించి కొద్దిపాటి 'పెన్షన్'ను మంజూరుచేసి కవి కన్నీటిని తుడుస్తుంది. ఈ కోవకు చెందిన వారిలో కవి పచ్చారి వెంకటేశ్వర్లు ఒకరు.

వీరు నెల్లూరు జిల్లా, కావలి తాలూకా, చామదల గ్రామంలో 1927వ సంవత్సరం జూలై నెల పదవ తేదీ జన్మించారు. వీరు ఎ. సి. సుబ్బారెడ్డి చరిత్ర, 'న'కార చిత్ర కవిత అక్షర విన్యాసం, పద వచనా కవితలు లాంటివి ఎన్నో రచనలు రచించి పెద్దల మన్ననల్ని పొందారు. వీరి కవిత్వాన్ని గుర్తించి, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ 1991వ సంవత్సరం నుండి ప్రతినెలా రెండువందల రూపాయలు 'పెన్షన్'ను మంజూరు చేసింది. అయితే వీరు రచించిన "బ్రహ్మదత్తశాస్త్రి మోక్షప్రాప్తి బడుగు వర్గాల విద్యావ్యాప్తి" రచన ప్రచురణ జరు గుచున్నది. వెంకటేశ్వర్లు 1985 వ సంవత్సరములో రచించిన 'న'కార చిత్ర కవిత అక్షర విన్యాసం ద్వితీయ ముద్రణకు సినీ గాయకులు యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఆరుద్ర, డాక్టర్ ఉక్కలినేని రాధాకృష్ణమూర్తి, మద్రాసు యూనివర్సిటీ ప్రొఫెసర్ రామచంద్ర చౌదరి, శతావధాని. సి.వి. సుబ్బన్న ప్రశంసలు లభించాయి. ఒకే అక్షరంతో ముగ్గురు సంవాదంతో నాలుగు వందల అక్షరములతో రచించిన రచన వెంకటేశ్వర్లు కవికీర్తి బావుటా ఎగురవేసింది. వీరు రచించిన ఎ.సి. సుబ్బారెడ్డి చరిత్ర పుస్తకాల్ని రాష్ట్ర ప్రభుత్వం లైబ్రరీలకు, పాఠశాలలకు సరఫరా చేసి, పారితోషికాన్ని అందించారు. స్వాతంత్ర్య ఉద్యమంలో వెంకటేశ్వర్లు పాత్రొని, 'మాకొద్దు తెల్లదొరతనము బాబు' అనే పాటలు పాడుకుంటూ విదేశీ వస్తువుల్ని, భాషను బహిష్కరించారు. వీరు రచించిన కవితలు, భారతి, ఆంధ్రపత్రికలలో ప్రచురితమయ్యాయి.

నెల్లూరు పట్టణంలో కవి వెంకటేశ్వర్లు ఎన్నో సన్మానాల్ని పొందారు. వీరు రచించిన రచనల్ని జనబాహుళ్యంలోకి తీసుకొనిపోయే దాతలకోసం కవి వెంకటేశ్వర్లు నిరీక్షిస్తున్నారు.